# ఆంధ్రపత్రిక

317613




The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 254 SATURDAY 17th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# 'ఆంధ్రరాష్ట్ర అవతరణతో మీకు శుభోదయం కాగలదు'

## హైద్రాబాదు కమ్యూనిస్టుల రేడియో సెట్టు, సైక్లోస్టయిలు యంత్రం పోలీసుల స్వాధీనం

(స్వకీయ విలేఖరులు)

ఏలూరు, డిసెంబరు 15: ఏలూరు డిప్యూటీ పోలీసు సూపర్నెంటు బి. యస్. నారాయణస్వామి నాయుడుగారు, సర్కిలిన్స్పెక్టరు పి. బి. రమణరావు, చింతలపూడి పోలీసు సబిన్స్పెక్టర్లు, కొంతమంది రిజర్వు పోలీసు సహాయంతో చింతలపూడి తాలూకా సరిహద్దునయున్న కృష్ణాజిల్లా గ్రామమైన మల్లాయగూడెంవద్ద బత్రిసుంట రిజర్వు ఫారెస్టుపై దాడిజరిపి, అడవిలో రహస్య ప్రదేశమునుండి ఒక రేడియోసెట్టు-ఏరియల్ మొదలైన సామానితోసహా, ఒక పెద్ద సైజు జెస్టెట్నర్ సైక్లోస్టయిలు యంత్రము-పరికరములు, అధికమైన కమ్యూనిస్టు వాఙ్మయము, రహస్యకమ్యూనిస్టు పత్రికలు వశపర్చుకున్నారు. ఇవి హైదరాబాదు సంస్థానంలో సంచరిస్తున్న "ప్రసాద్ దళము" అనే కమ్యూనిస్టు ముఠాకు చెందినవని తెలియుచున్నది.

## సంస్థానాలకు కేంద్ర శాసనాల వర్తింపు

## పార్లమెంటులో అంబేద్కర్ బిల్లు

న్యూఢిల్లీ, డిశంబరు 15: కేంద్రప్రభుత్వశాసనాల నన్నిటినీ సంస్థానాలకు వర్తింప చేయటానికిగాను, న్యాయశాఖామంత్రి అంబేద్కర్ ప్రతిపాదించిన బిల్లును ఈవేళ పార్లమెంటు ఆమోదించింది. ఆబిల్లుయొక్క ఉద్దేశాలను వివరించుతూ అంబేద్కర్ యిలా తెలియజేశారు.

'1949 ఆగస్టు అనంతరం, పూర్వం స్వతంత్రంగా వున్న అనేక సంస్థానాలు యొకాయొకి కేంద్రప్రభుత్వ పరిపాలనక్రిందికి వచ్చినై. ఆ కారణంగా, కేంద్ర ప్రభుత్వ శాసనాలను ఆయా సంస్థానాలన్నింటికి వర్తింపజేయటానికి అనువుగా తగిన శాసనం అవసరం' అన్నారు.

ఈ బిల్లును అభినందించుతూ చాలామందిసభ్యులు ప్రసంగించారు.

ఒరిస్సా ప్రతినిధి సారంగధరదాస్ గారు: 'ఈ శాసనంతో, సంస్థానాలలోని న్యాయపరిపాలన రాష్ట్రాల స్థాయికి తేవటానికి వీలౌతుందా?' అని ప్రశ్నించారు.

అంబేద్కర్: "కేంద్ర శాసనాలను వర్తింపజేసిన మాత్రాన సంస్థానాల న్యాయపరిపాలన మారటానికి వీల్లేదు. ఆయా సంస్థానాల న్యాయపరిపాలన ఆయా సంస్థానాలలో అమల్లో వున్న న్యాయచట్టాలను అనుసరించి వుంది. ఏయే రాష్ట్రాలలో ఆయా సంస్థానాలను విలీనం చేశామో ఆయా రాష్ట్రాలలోని న్యాయచట్టాలను ఆయా సంస్థానాలకు వర్తింప చేస్తేనేతప్ప పరిస్థితి మారదు. ఈ విషయంలో తగినశాసనాలను తయారుచేసుకోవలసిందిగా ఆయా రాష్ట్రప్రభుత్వాలను కోరబోతున్నాం." అన్నారు. బిల్లును శాసనసభ ఆమోదించింది.

## అణుశక్తి కంట్రోలుకు పథకం సూచించవలసిందని సర్ బి. ఎన్. రావుగారికి కమిషన్ అభ్యర్థన

న్యూయార్కు, డిసెంబరు 15: అణుశక్తి కంట్రోలును గూర్చి ఒక పథకాన్ని సూచించవలసిందిగా అణుశక్తి కంట్రోలు కమిషన్‌వారు సర్ బి. ఎన్. రావును అర్థించారు.

అట్లాగే సమితి అధ్యక్షుడు జనరల్ రోమ్యులోను గూడా ఒక మార్గాన్ని సూచించవలసిందిగా పై కమిషన్ అధ్యక్షుడు జనరల్ మెక్‌నాటన్ కోరినట్లు తెలుస్తున్నది.

సర్ బి. ఎన్. రావు జనరల్ రోమ్యులో ఇద్దరుగూడా చెరొక మార్గాన్ని ఆదివరకే సూచించి వున్నారు.

సర్ బి. ఎన్. రావు అంతర్జాతీయ న్యాయసంఘం అటం ఆయుధాలను నిషేధిస్తూ ఒక ప్రణాళికను సన్నద్ధం చేయాలని కోరారు.

జనరల్ రోమ్యులో అగ్రరాజ్యాలకు మధ్య ఒక విధమైన ఒడంబడిక అవసరమని అంటూ, అందుకుముందు అటం ఆయుధాల వినియోగాన్ని పరిహరించే ఏర్పాట్లు చేసుకోవాలని సూచించారు.

సర్ బి. ఎన్. రావు సూచన సమితిలో వీగిపోయింది. ఆ సందర్భంలో మాట్లాడుతూ అగ్రరాజ్యాలు తిరిగి తాను చేసిన సూచనకోసం తాపత్రయ పడవలసిన సమయం రాకపోదని సర్ బి. ఎన్. రావు అన్నారు.

సర్ బెనిగల్ ప్రస్తుతం కాశ్మీర్ సమస్యా పర్యాలోచనలో నిమగ్నులై వున్నారు. అందువల్ల ఆయనకు మంగళవారంనాడు జరిగే అణుశక్తి సమాలోచనలలో తన అభిప్రాయాన్ని వెల్లడించగల సావకాశం వుండకపోవచ్చును.

## మహత్తరమైన అణువు బాంబు

వాషింగ్టను, డిసెంబర్ 15: మొట్టమొదటగా నిర్మించబడిన అణువు బాంబుకంటె వెయ్యిరెట్లు శక్తికలిగిన అణువు బాంబు న్యూయార్కు నగరాన్ని గాని పూర్తిగా తుడిచిపెట్టగలదని నిన్నటి రోజున అణుశాస్త్రజ్ఞులున్నూ నోబెల్ బహుమతిపొందిన డా. హారోల్డుయూరీ చెప్పారు.

ఇటువంటి అణువుబాంబును తయారుచేయుటానికి అమెరికాలో ప్రయత్నాలు జరుగుచున్నవట.

## తన చేతిమీదిగానే ఇది జరిగితే మహద్భాగ్యంగా భావిస్తానని రాజాజీ అభిభాషణ

## రాష్ట్రనిర్మాణంలో తొందరపాటు కూడదని హితవు

## విశాఖపట్నం పౌరసన్మానసభలో గవర్నర్ జనరల్ ప్రసంగం



విశాఖపట్నం, డిసెంబరు 15: "త్వరలో రానున్న ఆంధ్ర రాష్ట్రంతో మీకు శుభోదయం కాగలదు. నేను మద్రాసు రాష్ట్రానికి ప్రధానినయిన కాలంనుండి మీ ఆశలు నెరవేరే శుభదినం కోసం ఎదురుచూస్తూనే వున్నాను. రాష్ట్రవిభజనకు అందరూ సమ్మతించినందుకు నేనెంతో ఆనందిస్తున్నాను. విభజన ఎలాజరగవలెనన్నది ఒక్కటే ఇప్పుడు ఈ కొద్ది ఆలస్యానికి కారణం. ఆదరాబాదరాగా పనిచేసి వెయ్యటంవలన ఒరిగే లాభమేమీలేదు. విభజన విషయాన్ని తేల్చే భారం ఆయాప్రభుత్వాలకు వదలివేసి మీరు నిశ్చింతగావుండండి. అంత మాత్రాన విభజన ఆలస్యంకావాలని నా ఉద్దేశ్యంకాదు. నేను గవర్నరుజనరలు పదవిలో వుండగానే మద్రాసురాష్ట్ర విభజనపై సంతకంపెట్టే అవకాశం నాకు లభించటం మహద్భాగ్యంగా ఎంచుకుంటాను." అని భారత గవర్నరు జనరల్ శ్రీ రాజగోపాలాచారిగారు నేడిక్కడ తమకు జరిగిన పౌరసన్మాన సందర్భంలో అన్నారు.

"నా చేతులమీదుగా ఆంధ్రరాష్ట్రం జన్మించినదన్న గౌరవం నాకు రావాలని కోరుతున్న ప్పటికీ, కేవలం ఈ గౌరవవ్యామోహంకోసం, విభజనకార్యం గబగబా, ఆదరాబాదరాగా, అసంపూర్ణంగా చేయబడటం నా కిష్టంలేదు. పరిస్థితులు వాటంతట అవి రూపొందటం మంచిది. నూత్నరాష్ట్రం త్వరలో అవతరించవలెనని మన మాశించుదాము." అని మరోమాట కూడా శ్రీ రాజగోపాలాచారిగారు అన్నారు.

### పౌరస్వాగతం

మనోహరంగా అలంకరింపబడిన విశాఖపట్నం పురమందిరంలో గవర్నరు జనరలుకు నేడు పౌరస్వాగతం, సన్మానం


2-వ పేజీ చూడుడు


## కమ్యూనిస్టు అరెస్టు

బందరు, డిసెంబరు 15: గత మేమాసంలో, హనుంగార్డు రామలింగయ్య హత్య సందర్భమున పోలీసులకు చిక్కవలసియున్న యార్లగడ్డ నారాయణరావను కమ్యూనిస్టును కొత్తవరం పోలీసు సబ్ఇన్స్పెక్టరు బి. బుల్లిరాజుగారు గుడ్లవల్లేరులో గత సోమవారంరాత్రి అరెస్టుచేశారు.

## "కాశ్మీర్‌లోని భారతసేనల ఉపసంహరణ ప్రమాదకరమైన విషయం"

## న్యూయార్కులో షేక్ అబ్దుల్లా ప్రకటన

న్యూయార్కు, డిసెంబర్ 15: "కాశ్మీర్‌నుంచి భారత సైన్యాలను ఉపసంహరించమని కోరటమన్నది సంస్థానభద్రతను భగ్నపరచటమే. రక్షిస్తున్న భారతసేనలు వెనుకకు తరలగానే ఎకటిపతానికి అప్పుడు మీదపడటానికి అవకాశం వస్తుంది. భారత సేనలను ఉపసంహరించటానికి అంగీకరించటం జరిగినదంటే అది సంస్థానభద్రతకు హానికలగదన్న షరతుమీదనే", అని కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా నేడిక్కడ విలేఖరుల ప్రశ్నలకు సమాధానమిస్తూ ప్రకటించాడు.

భద్రతాసంఘంలో ఎల్లుండి జరగబోతున్న చర్చలో పాల్గొనేందుకు ఆయన ఈవేళనే న్యూయార్కు వచ్చాడు. విలేఖరులతో ప్రసంగిస్తూ ఆయన ఈ కింది అంశాలు వెల్లడించాడు:

"న్యాయరీత్యా పాకిస్థానుకు కాశ్మీర్‌లో స్థానమేలేదు. కాశ్మీర్ చట్టపద్ధతి ప్రకారం భారతదేశంలో కలిసిపోయింది. ఆవిధంగా చేరిపోవటాన్ని ఆమోదించేదీ లేనిదీ కాశ్మీర్ ప్రజలు నిర్ణయించగలరు. కాని వారావిధంగా చేయటానికి ముందు అక్కడ శాంతి భద్రతలు ఏర్పడటం అవసరం.

### ప్రధానసమస్య పాకిస్థాన్ సేనలే

ఇప్పుడు కాశ్మీర్‌లో ప్రధానసమస్య అక్కడి పాకిస్థాన్ సేనలే. పాకిస్థాన్ దురాక్రమణదారులకు సాయపడుతూ ప్రోత్సహిస్తున్నదనీ, ఆవిధంగా తోడ్పడవద్దని భద్రతామండలి పాకిస్థాన్‌కు చెప్పాలనీ ఇండియా 1948లో కోరింది. తానావిధంగా చేయటం లేదని పాకిస్థాన్ అప్పుడు ప్రకటించింది. కాని మధ్యవర్తి సంఘం వెళ్లి చూసేటప్పటికి పాకిస్థాన్ సేనలు కాశ్మీర్‌లో ఉండటంవల్ల ఇప్పుడు ఒప్పుకుంటున్నది.

ఇప్పుడు పాకిస్థాన్ దురాక్రమణదారా కాదా తేల్చవలసి ఉన్నది. వివాదమల్లా ఇండియా, పాకిస్థాన్‌ల మధ్యనే. 'కాశ్మీర్ ప్రజలకు స్వయం నిర్ణయాధికారాన్ని ఇస్తాం, న్యాయరీత్యా ఇండియా అక్కడ ఉన్నది. కాని పాకిస్థాన్‌కు అక్కడ ఉండటానికి ఏ హక్కూ లేదు. దురాక్రమణ భయం తొలగిపోయి కాశ్మీర్ పనకటి ప్రతిపత్తికి వచ్చినప్పుడు జనవాక్యం నిర్వహించబడుతుంది."

"ఆజాద్ కాశ్మీర్ సేనలను నిరాయుధం జేసిన తరువాత కనితీర్పుకోవాలని ప్రయత్నించం అని హామీ ఇస్తారా?" అని ఒకరు ప్రశ్నించగా "కసి తీర్చుకోటం దేనికి? అది జరగదు" అని అబ్దుల్లా జవాబిచ్చాడు.

## లిబియా స్వాతంత్ర్యానికి సమితి పథకం: ఫ్రెంచి ఎసెంబ్లీ కమిషన్ నిరాకరణ

పారిస్, డిసెంబర్ 15: వీలైనంత త్వరలో కనీసం 1952జనవరి 1 లోగా— లిబియాను స్వతంత్రరాజ్యంగా చేయాలని, ఐక్యరాజ్యసమితి చేసిన నిర్ణయాన్ని ఫ్రెంచి నేషనల్ ఎసెంబ్లీ విదేశాంగ వ్యవహారాల కమిషన్ నేటి రాత్రి త్రోసిరాజన్నది.

ఫెజాన్‌లో ప్రభుత్వాన్ని స్థాపించవలసింది గాగూడా ఫ్రెంచిప్రభుత్వానికి, యీ కమిషన్ శిఫార్సుచేసింది. ఫెజాన్ దక్షిణ లిబియాలో ఉన్నది. దీన్ని మొన్నటి యుద్ధంలో, ఇటాలియన్లనుండి ఫ్రెంచి సైన్యాలు వశపర్చుకొన్నవి. అప్పటినుండి యిది ఫ్రెంచి పరిపాలనక్రిందనే ఉన్నది.

"లిబియా సమైక్యత, కృత్రిమమైనట్టిదని, ఐక్యరాజ్యసమితి లిబియా విషయంలో ప్రతిపాదించిన పథకం, లిబియా చరిత్రకు భౌగోళిక పరిస్థితులకు విరుద్ధమని కమిషన్ స్పష్టంచేసింది.

## సిబ్బంది, ఆస్తి అప్పుల విభజన సంఘ కార్యకలాపం రెండు రోజుల్లో పూర్తిఅయ్యే అవకాశం

మదరాసు, డిశంబరు 16: విభజన సంఘము నియమించిన సిబ్బంది, ఆస్తి, అప్పుల పంపక సంఘములు మరి రెండు,మూడు సమావేశములలో వారి పనిని పూర్తిచేయ గలరని తెలియుచున్నది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సందర్భమున సిబ్బంది, ఆస్తి అప్పుల పంపకమునకు సంబంధించిన సూచనలు చేయుటకు అవసరమగు సామగ్రిని సిద్ధముచేయుటలో నిమగ్నులై యున్నారు.

ఈ ఉపసంఘములు తమ నివేదికను ఈ వారాంతములోగా విభజనసంఘము నకు 21-వ తేదీ సమావేశమునకు అందజేయగలరని తెలియుచున్నది.

డిశంబరు 24 తేదీన జరుగు మంత్రివర్గ సమావేశములో చర్చించుటకు వీలుగా విభజనసంఘము మూడు, నాలుగు సమావేశములలో పనిముగించి నివేదిక తయారుచేయవచ్చునని అనుకుంటున్నారు. అయితే ఇదంతా ఉపసంఘమువారిచ్చే భోగట్టాను బట్టి, విభజనసంఘమువారి చురుకుమీద ఆధారపడి యుండును.

సిబ్బంది నిర్ణయ ఉపసంఘము నేటి సమావేశములో ఎలెక్ట్రిసిటీ ఛీఫ్ ఇంజనీర్, ఇరిగేషన్, సానిటరీ ఛీఫ్ ఇంజనీర్లు పి. డబ్ల్యు. డి. అడిషనల్ ఇంజనీరు జైళ్ల ఇన్స్పెక్టరు జనరలు, పబ్లిక్‌హెల్త్ స్కూళ్ల ఛీఫ్ ఇన్స్పెక్టరు వారి వారి శాఖల విషయములుచర్చించిరి. ఆ యాడిపార్టుమెంటుల కార్యదర్శులుకూడ చర్చలలో పాల్గొనిరి. మిగిలిన డిపార్టుమెంటులలో చర్చించుటకు ఉపసంఘము శుక్రవారము అవసరమైతే శనివారముకూడా సమావేశమయ్యెదరు.

ఆర్థిక ఉపసంఘము రెండవసారి నిన్న సమావేశమై ఆంధ్రరాష్ట్రము, తమిళరాష్ట్రము మధ్య ఆస్తి అప్పుల పంపిణీ గురించి చర్చించిరి. మరల శనివారము సమావేశమై పని పూర్తి చేయగలదని తెలియుచున్నది.

## సరిహద్దు కమిషనర్ నియామకం

మదరాసు, డిశంబర్ 15: ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సందర్భమున సరిహద్దుల నిర్ణయమునకు బీహారు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ అగర్వాలాగారిని ఇండియా ప్రభుత్వము సూచించినట్లు తెలియుచున్నది.

## పార్లమెంటు సభ్యత్వ ఎన్నికలు

మదరాసు, డిసెంబరు 16: నేడు అసెంబ్లీలో పార్లమెంటు సభ్యత్వ ఉపఎన్నికలను గురించి ఇంతవరకు సమాచారమేమీ అందలేదని జనాబ్ మజీద్‌కు స్పీకరు శ్రీ శివషణ్ముగంపిళ్ళె తెలిపిరి.

## గాంధీ స్మారక నిధినుండి గ్రాంట్లు

## భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖ అభ్యర్థన

న్యూఢిల్లీ, డిశంబరు 16: ఇండియా ప్రభుత్వ ఆరోగ్యశాఖవారు కుష్టు పరిశోధనాసంస్థ స్థాపించడానికిగాను గాంధీ స్మారక నిధినుండి 10 లక్షల గ్రాంటు కోరుతున్నారట.

గాంధీ స్మారకనిధికింద వసూలయిన 10 కోట్ల 35 లక్షలు ఏవిధంగా వినియోగించవలసినదీ ఇంకా అధికారరీత్యా నిర్ణయంకాలేదు. కాని గ్రాంటులకోరకు అర్జీలు చాలా జరుగుతున్నవట.

స్మారకనిధి ధర్మకర్తృత్వ సంఘంవారు ఇటీవల చేసిన నిర్ణయాన్నిబట్టి దేశంలోని అన్నిరాష్ట్రాలలోనూ ఏజెంట్లూ బోర్డులూ ఏర్పాటై వారి శిఫార్సులనుబట్టి నిర్మాణ కార్యక్రమానికీ, ప్రత్యేక సంస్థలకూ గ్రాంటు లివ్వబడుతవి. అధ్యక్షుని ఇచ్ఛానుసారం గ్రాంటు లివ్వడానికి ప్రత్యేకించిన మొత్తంనుంచి 4 లక్షలు మాత్రం ఇవ్వబడినవి.

గాంధీఘట్టాలు నిర్మించాలని ప. డిట్ నెహ్రూ చేసిన సూచన ప్రస్తుతానికి నిలిపివేయబడింది. ఈ ఘట్టాలను చూసేటందుకు వెయ్యిమంది కార్యకర్తలు తయారు అయినపిదప వీటినిర్మాణం సాగవచ్చును.

## ఉక్కు ఇనుపరేకుల ఖరీదు తగ్గింపు

## ఇండియా ప్రభుత్వ ప్రకటన

కలకత్తా, డిశంబర్ 15: ప్రజలకత్యవసరముగా కావలసిన వస్తువుల ధరలు తగ్గించు ప్రభుత్వ విధానము ననుసరించి పూతపూసిన యినుపరేకుల యొక్కయు, పూతపూయని యినుపరేకులయొక్కయు, అమ్మకపు ధరలు డిసెంబరు 16 వ తేదీనుండి తగ్గింపబడినవని పరిశ్రమల, సప్లయి శాఖవారు ప్రకటించుచున్నారు. ఈతగ్గింపు 100 కి దాదాపు 10 వంతులుగా నుండును. ఈ ధరలు 1949 సం॥ జూలై 8 వ తేదీకి పూర్వముండిన ధరలతో సమముగా వింపబడినవి.

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ ద్వాదశి
1949 సం॥ డిసెం॥ 17 శనివారం
శ॥ ద్వాదశి ఉ 8-50 త్రయో తె 5-58 విశా రా 9-18 వర్జ్యం రా 12-56 ల 2-28 కు.
బ॥ చతుర్దశి డిసెం॥ 18 ఆదివారం
ఆ॥ చతుర్దశి రా 8 5 అనూ సా 7-7 వర్జ్యం రా 12-16 ల 1-48 కు.

ఆంధ్రపత్రిక
విరోధి సం॥ మార్గశిర బ॥ ద్వాదశి
శనివారం

## చక్కెర పరిశ్రమ

చెరుకుధర హెచ్చుగ నుండుట వలన చక్కెరధర ఎక్కువైనదని పారిశ్రామికులు వాదించినను, చక్కెర ఉత్పత్తి ఖర్చులు విపరీతముగ నున్నందున, పారిశ్రామికులు ఎక్కువ లాభమును తీసుకొనుట వలన చక్కెరధరను తగ్గించుట సాధ్యముగాకున్నదని చెరుకుపంటదారులు వాదించినను, వీరుభయులు ప్రభుత్వముతో సహకరించి చెరుకు ఉత్పత్తి, చక్కెర తయారు చేయుటలో ఖర్చులను తగ్గించి, ఒక క్రమపద్ధతిని అనుసరింపకపోయిన భారతదేశమున చక్కెరపరిశ్రమకే ప్రమాద మేర్పడగలదు. ఇప్పటికి దాదాపు రెండు దశాబ్దములుగ ప్రభుత్వము భారత చక్కెర పరిశ్రమను సంరక్షించుచున్నది. ప్రజలు దేశీయపరిశ్రమలను ప్రోత్సహించుటకు విదేశములనుండి దిగుమతియగు చక్కెర తక్కువధరకు లభింపగల యవకాశము ఉండినప్పటికిని, ప్రభుత్వముతో సహకరించి చక్కెరకు హెచ్చుధరలను చెల్లించుచుండిరి.

పారిశ్రామికులు ఈ యవకాశము వినియోగించుకొని పరిశ్రమను స్వయంపోషకము చేయుటకు బదులు విపరీతలాభములను ఆర్జించుటలో నిమగ్నులై స్వధర్మమును విస్మరించిరి. వారా స్వార్థమును వదులుకొనలేనందుననె పరిశ్రమకు మరొక అయిదు సంవత్సరములు రక్షణ మవసరమను ఆందోళన హెచ్చినది. పారిశ్రామికులుగాని వ్యాపారస్థులుగాని పోటీ లేనంత కాలము తమవస్తువుల ఉత్పత్తి ఖర్చును తగ్గించి, వస్తువుల ధరలు సామాన్య ప్రజలు అందరికి అందుబాటులో నుండునట్లు చూచుటకు ప్రయత్నింపరు. మిల్లు యజమానులలో పోటీ ఏర్పడకుండ, అందరు ఒకే ధరకు తమ సరకును విక్రయించునట్లు "సుగర్ సిండికేట్" తగిన కట్టుబాటులు చేసెను. బీహారు, సంయుక్తరాష్ట్ర ప్రభుత్వములు ఈ సిండికేట్‌తో లాలూచీపడి చక్కెరధరను దాదాపు మూడోవంతు పెంచెను. ఈ చర్యల ఫలితముగ దేశమున చక్కెర క్షామము ఏర్పడినది. ఈ క్షామమునకు ఉత్పత్తి తగ్గుదలగాక, పారిశ్రామికుల, చక్కెర వ్యాపారుల లాభాపేక్షే కారణమని మొన్న నగరమున జరిగిన రాష్ట్ర చెరుకుపంటదారుల మహాసభకు ప్రారంభోత్సవము చేయుచు రాష్ట్ర వ్యవసాయ మంత్రి శ్రీ ఎ. బి. షెట్టిగారు చేసిన ప్రసంగమునుబట్టి గ్రహింపవలసియుండును

దేశమున విక్రయమగుచున్న ధరకు తక్కువగ పాకిస్థాన్‌కు ఎంతైనా ఎగుమతిచేయుటకు సిద్ధపడిన పారిశ్రామికులు తమ దేశీయులకు తక్కువ ధరకు అమ్మక పోయినను, అవసరములకు తగినంత చక్కెరను సప్లయి చేయ నిరాకరించుట, సప్లయిచేయుటకు వీలుగాని పరిస్థితులను కల్పించుట వ్యతిరేకముగ చూచినను సమర్థనీయము గాదు. అట్టి వారికి సామాన్యప్రజలనుండి ధనము వసూలుచేసి రక్షణ లేర్పరచుట దేశక్షేమము దృష్ట్యా వాంఛనీయముగాదు.

చెరుకుపంటదారులను మాత్రము తమ చెరుకును తక్కువ ధరలకు విక్రయించునట్లు చేయగల ప్రభుత్వము పారిశ్రామికులును తమసరుకును న్యాయమైన ధరలకు విక్రయించునట్లు చేయలేకపోవుట విపరీతముగ నున్నది. రాష్ట్ర చెరుకుపంటదారుల సభ ఆహ్వానసంఘ అధ్యక్షుడు శ్రీ సుందరరెడ్డిగారు ప్రజలకు చక్కెరధర అందుబాటులో నుండునట్లు చేయుటకు పంటదారులు ఎక్కువ లాభమును కోరక గిట్టుబాటుగ నుండు ధరలకు, తమ చెరుకును విక్రయింపగలరని ప్రకటించిరి. ఇంతవరకు ఏ పరిశ్రమకు చెందినవారును ఇట్టి ప్రకటనను చేసియుండలేదు. అసలు వీరు ఏ సమస్యను ఈ దృష్టితో పరిశీలించియుండలేదు. బీహారు, సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వములు ప్రదర్శించిన స్వార్థపరత్వమును గ్రహించిన మీదట మన రాష్ట్రమును చక్కెర విషయమున స్వయంపోషకము చేయుటకు ప్రభుత్వము అవసరమైనట్టి యావత్తు చర్యలు తీసుకొనవలసియుండును. మిల్లు యజమానులు సహకరింపకున్న చక్కెర యంత్రములను స్వాధీనపరుచుకొని పరిశ్రమను జాతీయ మొనర్చుట అవసరము. కాలపరిమితి లేక ఈ పరిశ్రమకు రక్షణ నిచ్చుట వలన పారిశ్రామికులలో బాధ్యతారహిత వర్తనమును ప్రోత్సహించినట్లగును. భారత శాసనసభ తిరిగి రాబోవు సంవత్సరము చక్కెర పరిశ్రమకు రక్షణ నివ్వవలెనా అవసరము లేదా యను విషయమును పరిశీలింప నున్నది. పారిశ్రామికులు ఈ లోపున తమ ప్రస్తుత వైఖరిని మార్చుకొని రక్షణ కాలపరిమితి హెచ్చింపుకు అర్హతనుసంపాదింపవలసియున్నది.

## తుపానుబాధితుల సహాయనిధి
### సి. పి. ప్రధాని రవిశంకర శుక్లాపర్యటన

నాగపూర్, డిశంబరు 14: ఆంధ్రదేశపు తుపానుబాధితుల సహాయార్థం, మధ్యపరగణాల ప్రధాని రవిశంకరశుక్లా ఒకసహాయనిధిని ప్రారంభించారు.

ఈ నిధికి ప్రజలు ధారాళంగావిరాళాలు యిచ్చి ఆంధ్రసోదరులకు సాయపడవలసిందిగా శుక్లాజి పిలుపు ప్రకటించారు. వసూలైన మొత్తం మద్రాసు గవర్నర్ ఆంధ్రతుపాను సహాయనిధికి అందజేశారు.

## మరత్తుపై రీవా మాజీ మహారాజా విడుదల

న్యూఢిల్లీ, డిశంబరు 15: 'రీవా మాజీ సంస్థానాధీశ్వరుడగు సర్ గులాబ్‌సింగ్ కొన్ని షరతులపై చెరసాలనుండి విడుదల గావింపబడెను. ఈ షరతుల ననుసరించి ఆతడు ప్రస్తుత వింధ్యప్రదేశ్ యూనియనుకు ప్రతికూలముగా వ్యవహరింపరాదు. ఈ యూనియనుకు ప్రతికూలమగు కార్యకలాపములలో శ్రద్ధగైకొనరాదు. వింధ్యప్రదేశ్ యూనియను, సం॥ రాష్ట్రములు, మ॥ రా॥ యందలి జబ్బల్‌పూరుజిల్లాలలో నివసింపరాదు, అని సంస్థానశాఖ మంత్రి సర్దార్ పటేలుగారు పార్లమెంటులో ప్రకటించిరి.

సౌరాష్ట్ర యూనియను బొంబాయి రాష్ట్రములో కలిసిపోవ గోరుచుండెనా? అను విషయమై సౌరాష్ట్ర ప్రజల అభిప్రాయము కనుగొనుటకు అవసరము కలుగలేదని సర్దార్ పటేలుగారు చెప్పిరి.

## రివిన్యూ డివిజనుల పునర్విభజన
### నాలుగు జిల్లాలలో తగ్గింపు ఉత్తర్వు

మదరాసు, డిసెంబరు 14: అనంతపురం, బళ్లారి, చిత్తూరు, తిరునల్వేలిజిల్లాలలో రివిన్యూ డివిజనులను తగ్గించి పునర్విభజన వుత్తర్వుచేసెను.

దీనననుసరించి 1950 జనవరి 1 నుండి (1) అనంతపురంజిల్లా గుత్తి రివిన్యూ డివిజన్ (2) బళ్లారిలోని ఆదోని డివిజను (3) చిత్తూరులోని చిత్తూరు డివిజను (4) తిరునల్వేలిజిల్లాలోని కోయిల్‌పట్టి, సత్తాంకుళం సబ్‌డివిజన్ రద్దుచేయుచూ ఆ నాలుగు జిల్లాలలోని పైన ఉదహరించిన తాలూకాలను మిగిలిన రివిన్యూ డివిజనులకు కలిపి ఈ విధముగా పునర్విభజించుచూ ప్రభుత్వము వుత్తర్వుచేసెను.

అనంతపురం: అనంతపురం డివిజన్: అనంతపురం, కల్యాణదుర్గం, గుత్తి (ఉరవకొండ సబ్‌తాలూకాతో చేర్చి) తాడిపత్రి తాలూకాలు కార్యాలయం: అనంతపురం పెనుకొండ డివిజన్: పెనుకొండ, ఇందుపూర్ మడకశిర, కదిరి, ధర్మవరం తాలూకాలు కార్యాలయం: పెనుకొండ.

బళ్లారిజిల్లా: బళ్లారి డివిజన్: బళ్లారి రాయదుర్గం, ఆదోని, ఆలూరుతాలూకాలు కార్యాలయం; బళ్లారి; హాస్పేట డివిజన్: హాస్పేట, హార్పన్‌హల్లి, కుడ్లిగి, హాడగిల్లి శిరుగుప్పతాలూకాలు కార్యాలయం: హాస్పేట.

చిత్తూరుజిల్లా: మదనపల్లి డివిజన్: మదనపల్లి, వాయల్పాడ్, పుంగనూర్, పలమనీర్ తాలూకాలు కార్యాలయం: మదనపల్లి; చంద్రగిరి డివిజన్: చంద్రగిరి కాళహస్తి, పుత్తూరు, తిరుత్తణి; చిత్తూరు తాలూకాలు కార్యాలయం: చంద్రగిరి.

తిరునల్వేలిజిల్లా: తిరునల్వేలి డివిజన్: తిరునల్వేలి, శంకరన్ కోయిల్ తాలూకాలు తూత్తుకుడి డివిజన్: తిరుచెందూర్, శ్రీవైకుంఠం, కోయిల్‌పట్టి తాలూకాలు, ధర్మాదేవి డివిజన్: టెంకాశి, నాంగునేరి, అంబసముద్రం, అంజెంగో తాలూకాలు.

## తేయాకు పంట అభివృద్ధి
### "బోర్డు" ప్రచారము

బొంబాయి, డిసెంబరు 14: తేయాకు హెచ్చుగా ఉత్పత్తిచేయవలెనని, తేనీటిని ఎక్కువగా త్రాగవలెనని భారత తేయాకు బోర్డు అమెరికా కనడాల్లలో తీవ్రప్రచారము ప్రారంభించినది.

ప్రపంచమునందలి అన్ని దేశములకంటె భారతదేశము యెక్కువ తేయాకు ఎగుమతిచేయుచున్నది. ఈ ప్రథమ స్థానమును భారతదేశము స్థిరపరుచుకొన గోరుచున్నది. పౌను విలువ తగ్గించుటవల్ల భారతదేశ తేయాకు ఎగుమతులు విశేషముగా హెచ్చినవి.

గత సంవత్సరము భారతదేశము అమెరికాకును, డాలర్ ప్రాంతములకును 3 కోట్ల 40 లక్షల ఎల్. బి. పౌండ్ల తేయాకును ఎగుమతిచేసియుండెను. 1949 సం॥ను మొదటి 9 నెలలలో 3 కోట్ల 20 లక్షల పౌనులను ఎగుమతిచేసియుండెను.

1948 సం॥ములో భారతదేశం మొత్తం ఎగుమతులు 41 కోట్ల పౌండ్లు. దేశములో వినియోగము 15 కోట్ల పౌనులు.

సెప్టెంబరుమాసములో అనగా స్టర్లింగ్ మారకపు విలువ తగ్గించిన నెలలో భారతదేశము 7 కోట్ల 40 లక్షల రూపాయలు విలువచేయు తేయాకు ఎగుమతి చేసెను. అక్టోబరులో 6 కోట్ల 38 లక్షల రూపాయల విలువగల తేయాకు ఎగుమతి చేసెను. ఈ సంవత్సరము భారతదేశములో 50 కోట్లపౌండ్ల తేయాకు ఉత్పత్తి యగునని అంచనా వేయుచున్నారు. దీనిలో 43 కోట్ల 50 లక్షలు ఎగుమతి యగును. ఎగుమతులను యింకా వృద్ధిచేయ భారత తేయాకు బోర్డు సంకల్పించుచున్నారు. అమెరికాలో యింకా యెక్కువమంది తేయాకు సేవించునట్లు చేయుటకు భారతప్రభుత్వము వారు కొన్ని చర్యలు తీసికొనవలెనని తేయాకు బోర్డువారు సూచించిరి. ఇందువల్ల భారతదేశమునకు ఎక్కువడాలర్లు చేకూరునని వారు చెప్పుచున్నారు. పౌను మారకపు విలువ తగ్గుటవల్ల అమెరికా, కనడాలకు యింకా యెక్కువగా తేయాకు ఎగుమతియగు అవకాశమున్నట్లు కనిపించుచున్నది. కొలంబోవేలలకంటె కలకత్తా, కొచ్చిన్‌లలో ధరలు తక్కువగా ఉండుటవల్ల విదేశీయ కొనుగోలుదారులు భారత తేయాకును ఎగబడుచున్నారు.

అమెరికావారు కూడ తేయాకు ఎక్కువగా త్రాగవలెనని ప్రచారము సాగించ నిశ్చయించుచున్నది. అమెరికాలోనికి దిగుమతియగు ఒక పౌండు తేయాకుమీద ఒక సెంటు పెన్నువిధించి, ఇందువల్ల చేకూరు ద్రవ్యముతో వారు ప్రచారము సాగింప దలచుచున్నారు.

## ఆంధ్రరాష్ట్ర నిర్మాణం: రాజాజీ ఉద్బోధ

(1 వ పేజీ తరువాయి)

జరిగింది. ఆయన నేటిమధ్యాహ్నమే ఢిల్లీనుండి ప్రత్యేక విమానంలో తమకుమార్తె శ్రీమతి నామగిరితోను, మిలిటరీ కార్యదర్శి కల్నల్ చటర్జీతోను, మిగకా పరివారంతోను ఇక్కడకువచ్చారు.

విమానాశ్రయంవద్ద మద్రాసు గవర్నరు భావనగర్ మహారాజా, మహారాణి గవర్నరు జనరలుకు స్వాగత మిచ్చారు. తరువాత ఆర్థిక మంత్రి బి. గోపాలరెడ్డిగారిని, పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ జె. దేవసహాయం, జిల్లాకలెక్టరు డి. పద్మనాభం, మునిసిపల్ చైర్మన్ టి. విశ్వనాథంగార్లను గవర్నరుగారు ఎరుకపరచారు. విశ్వనాథంగారు రాజాజీకి పూలమాలనర్పించారు. విమానాశ్రయాధికారి పదేళ్ళకుమార్తె కూడ పూలమాల వేసింది. గవర్నరుజనరల్ విమానందిగుతుండగా నౌకా, సైనికదళములు, ప్రత్యేకసాయుధపోలీసులు గౌరవవిన్యాసాలుచేశారు. జనగణమనగీతం బ్యాండుపై మేళవించబడింది.

స్థానిక శాసనసభ్యులైన సి. వీరభద్రరావు, స్త్రీ. చలసాని, పి. వీరభద్రుడు, జి. సన్యాసిరావుగార్లను, రాజరత్నం (డి. ఐ. జి.) కె. ఎల్. నరసింహం (జిల్లాజడ్జి) కెప్టెన్ గోస్వామి (నౌకాశాఖాధికారి) గురుబచన్‌సింగు (సైనికాధికారి) పి. తిరుమలయ్య (అసిస్టెంటు కలెక్టరు) ఖురుషాం రాజాసాహెబు గార్లను శ్రీ రాజాజీకి జిల్లాకలెక్టరు పరిచయంచేశారు.

విమానాశ్రయంనుండి గవర్నర్ జనరల్ బి. ఎన్. రైల్వే విశ్రాంతిభవనమునకు వెళ్ళారు.

### సన్మానపత్రం

పురమందిరానికి రాజాజీరాగానే చైర్మన్ విశ్వనాథంగారు వారిని గౌరవపురస్సరంగా ఆహ్వానించారు. భావనగర్ మహారాజా, మహారాణి, జయపూర్ మహారాజా గార్లుకూడా హాజరయ్యారు.

మద్రాసు ప్రధాని గా మొదటిసారి ఈ పట్టణానికి రాజాజీ రావడాన్ని ప్రస్తావిస్తూ, గవర్నరు జనరలుగా ఈ సారి వచ్చేసినందుకు సన్మానపత్రంలో సంతోషం వెల్లడింపబడింది. రాజాజీ గవర్నరు జనరలు పదవిలో వుండగానే ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ప్రయత్నాలు జరుగుతున్నందుకు రాష్ట్రంకూడా అనతికాలంలో రానున్నందుకు, ఆనందిస్తున్నామనీ, టి. విశ్వనాథంగారు సన్మానపత్రం చదువుతూ అన్నారు.

నైసర్గికంగానే రేవు, నౌకాశ్రయము, నౌకాబల స్థావరమూ అయిన విశాఖపట్టణమును బహుముఖంగా అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం పూనుకోవలెనని, హార్బరు నౌకాబల స్థావరము, విమానాశ్రయము, నౌకానిర్మాణశాల, రాబోయే నౌకా శిక్షణ శాలశాల ఇన్ని కేంద్రసంస్థలు మునిసిపల్ పన్నులు లేకుండా ఇక్కడ వుంటున్నవనీ, కనుక ఈ నగరాభివృద్ధిపై కేంద్రప్రభుత్వం శ్రద్ధ వహించవలెననీ, ఈ నగరం అభివృద్ధి పొందటం దేశానికే లాభకరమనీకూడా సన్మానపత్రంలోవిన్నవింపబడినది.

ముగింపుగా, కంట్రోలు విధానాన్ని రద్దు చేయవలసిందనికూడా విన్నవింపబడింది.

### ఎంత సుందరప్రదేశం!

సన్మానపత్రానికి సమాధానమిస్తూ గవర్నరు జనరలు ఇలా చెప్పారు.

"ఇక్కడకువచ్చిన ప్రతివానిని ఈ కొండలు, ఈసముద్రం, సముద్రతీరం ముగ్ధుని చేస్తాయి. ఇక్కడి ప్రకృతి సౌందర్యాన్ని, నైసర్గిక పారిసర్వ్యమును చూసిన ప్రతివాడూ ఈనగరం అభివృద్ధి చేయబడి తీరవలసిందేనని భావిస్తాడు. అందుకనే భారతప్రధాని ఇక్కడకువచ్చినప్పుడు ఈప్రదేశసౌందర్యాన్ని చూసిచకితులై, ఈ నగరం అభివృద్ధి చేయబడవలెనని అన్నారంటే, అందులో ఆశ్చర్యమేమీలేదు.

కేంద్రప్రభుత్వం ఇప్పుడు ఈ నగరాభివృద్ధికి చేసేదానికంటే ఎక్కువ చేయవలెనని మీరు సన్మానపత్రంలో కోరారు. నేను మీ కోరికను నా ప్రభుత్వమునకు అందజేస్తాను. వారు తమకు సాధ్యమైనంత చేయగలిగినదంతా చేస్తారని నేను విశ్వసిస్తున్నాను.

కాని ఒక సంగతి. ఏ పట్టణాన్ని కృత్రిమంగా విస్తరించటం పనికిరాదు వర్తక వ్యాపారాలు పెరిగినకొద్దీ పట్టణం దానంతట అదే పెరుగుతుంది. ఇక మీరు చేయవలసిందేమిటంటే, అదిను ఏ పట్టణం ఆరోగ్యకరంగా, పరిశుభ్రంగా వుండేటట్లు జాగ్రత్తగా చూడాలి. మొదటినుంచీ పట్టణంలో మురికినీరు సరిగ్గా పారేటట్లు, చెత్త చెదారం కనిపించకుండా ఆరోగ్యంగా వుండేట్లు, ముందుముందు పట్టణం పెరిగేటప్పుడు ఏ పద్ధతుల్లో, క్రమంలో పెరిగితే అందంగాను, ఆరోగ్యంగాను వుంటుందో దానిని, జాగ్రత్తగా ఒక ప్రణాళిక ప్రకారం కనిపెడుతూ వుండాలి. ఇది ఈనాటి పట్టణాల అధికారులంతా శ్రద్ధవహించవలసిన విషయం. వర్తక వ్యాపారాలకోసం, ఇతర వ్యాసంగాలకోసం ప్రజలు ఇక్కడికి మూగుతారు; పట్టణం వృద్ధి అవుతుంది; కాని మీరు దాని ఇష్టంవచ్చినట్లు దానిని వృద్ధి కానివ్వరాదు. ఈ సముద్రతీరసనగరపు సౌందర్యం, ఆరోగ్యం చెడిపోకుండా మీరు జాగ్రత్త తీసుకోవాలి.

### కంట్రోళ్ల రద్దు

చైర్మన్‌గారు తమ సన్మానపత్రంలో మహా ముచ్చటైన విషయాన్నికూడా ముచ్చటించారు. వారు కంట్రోళ్లు రద్దు చేయించాలని కోరినప్పుడు ప్రేక్షకులు చప్పట్లుకొట్టి, హర్షధ్వానాలు చేస్తారనుకున్నాను. కాని వారు అంత హడావుడి పడనందుకు సంతోషిస్తున్నాను.

ఆహారం మొదలైన అనేకపదార్థాలు ప్రస్తుతం కొరతగా వున్నాయనీ, ఈ కొరత కంట్రోళ్ళవల్ల మరీ ఎక్కువైనదని చైర్మన్‌గారన్నారు. కేవలం కంట్రోలు వల్ల కొరత ఎక్కువకాదు. ఒకవస్తువు కొరతగా వున్నప్పుడు దానిని శాసనం ద్వారా అదుపులో వుంచటం అవసరము. కాని మోసకారులైన ప్రజలు కొరతను, కంట్రోళ్ళనుకూడా స్వలాభానికి వినియోగించుకొనటంవల్ల పరిస్థితి విషమించటం తటస్థిస్తున్నది. కంట్రోళ్ళను తొలగించినా మోసకారులు తొలగిపోరు. కంట్రోళ్ళ తొలగింపుతో వారు మరీ విజృంభిస్తారు. ముఖ్యంగా పట్టణాలు ఈ మోసకారుల దయాదాక్షిణ్యాలమీద బ్రతకవలసి వస్తుంది. ఈ సమస్య కోటానకోట్ల ప్రజలకు సంబంధించింది. ప్రభుత్వంలో ఉన్నవారు కంట్రోళ్ళను తొలగించి, దోపిడిదార్లను ప్రోత్సహించటానికి ఇష్టపడటంలేదు. అందుచేతేవారు ఈ విషయంలో వెనుకాడుతున్నారు. దైనందినంగా, పరిపాలనా విధానాలను నిర్ణయించే ప్రభుత్వసభ్యులు అనర్థవజ్ఞులనీ, నిష్కల్మషులని, నమ్మకమైన వారని నేను మీకు నొక్కిచెబుతున్నాను. వారు వెనుకముందు లాలోచించకుండా ఏపని చెయ్యటంలేదు, అడపా తడపా వారు తమవిధానాన్ని సంస్కరించుకోవటం బట్టే వారి నిజాయితీ, నిష్కాపట్యం స్పష్టపడుతున్నది.

ఈ స్వాగత మిచ్చినందుకు మీకు నా కృతజ్ఞత. క్రమపద్ధతిలో, ఆరోగ్యవంతంగా మీనగరం అభివృద్ధిఅయి, దాని సౌందర్యం ఇనుమడించవలెనని మళ్ళీ ఆశిస్తున్నాను."

### "మీ వ్రేళ్ళలో సరస్వతి నృత్యం చేస్తున్నది"

జిల్లాక్షేమ నిధి సంఘంవారు తుపాను బాధితుల సహాయంకోసమై స్థానిక సరస్వతీ మహల్‌లో సంగీతకచ్చేరీ ఏర్పాటు చేశారు. వాయులీన విద్వాంసులు శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారు వాయులీనం వాయించారు. గవర్నరు జనరలు, గవర్నరు దంపతులు బి. గోపాలరెడ్డిగారు ఈ కచ్చేరికి హాజరయ్యారు. వీరికి మహల్ ద్వారంవద్ద శ్రీమతి ఎ. వి. భానోజీరావు, రావు బహదూర్ ఎమ్. పట్టాభిరామిరెడ్డిగారు ఆహ్వాన మిచ్చారు. శ్రీమతి భానోజీరావుగారు రాజాజీని పుష్పహారాలతో ముంచెత్తారు.

ద్వారంవారి వాయులీన గానమును గవర్నరుజనరలు చివరవరకూ ఉత్సాహంతో విన్నారు. తరువాత సయీదా రహమాన్, వహీదా రహమాన్ గార్లు నాట్య ప్రదర్శనం చేశారు. ఈ ప్రదర్శనానికి మొత్తం 20 వేల రూ॥లు వసూలైనదని పట్టాభిరామిరెడ్డి ప్రకటించారు. ఈ ధనం గవర్నరుగారి తుపానునిధికి సమర్పింపబడుతుంది.

వెంకటస్వామినాయుడుగారికి స్వర్ణపతకం బహూకరిస్తూ, "మీ వ్రేళ్ళలో సరస్వతీదేవి నాట్యం చేస్తున్నది. దేవి మిమ్మల్ని అనుగ్రహించింది." అన్నారు రాజాజీ. మృదంగికుడు వెంకటస్వామిగారికి, సయీదా, వహీదా రహమాన్ గార్లకుకూడా పతకములు బహూకరించారు.

పిమ్మట గవర్నరు జనరల్ జయపూరు రాజా శ్రీ విక్రమదేవ వర్మగారికి, డి. పద్మనాభన్ గారికి, వారి సతీమణికి దర్శనమిచ్చారు.

పురపాలక సంఘంవారు రాజాజీకి ఒక అందమైన పేటికలో పెట్టి సన్మానపత్రాన్ని సమర్పించారు. ఈ పేటిక యెలమంచిలి తాలూకా, యేటికొప్పాక గ్రామంలో తయారయింది. యీగ్రామం పేటికాపరిశ్రమకు ప్రాచీనకాలం నుండీ పేరు పొందినది.

## సర్దారు పటేలు

జయపూరు, డిసెంబరు 15: సర్దారు పటేలుగారు స్వల్ప విశ్రాంతికై కూరీ వెళ్లిరి. తిరిగి డిసెంబరు 19 తేదీకి ఢిల్లీ వెళ్లెదరు. రాజస్థాను రీజియనలు కమీషనరు సి. యస్. వెంకటాచారిగారు సర్దారు పటేలుగారిని ఇచటకు వచ్చి సందర్శించిరి.

## జమీందారీ రద్దు చట్టము
### నియమములకు మద్రాస్ అసెంబ్లీ ఆమోదం

మదరాసు, డిశంబరు 16: మదరాసు అసెంబ్లీ నేడు స్పీకరు శ్రీ జె. శివషణ్ముగం పిళ్ళె గారి అధ్యక్షతను సమావేశమైనప్పుడు రివిన్యూ మంత్రి శ్రీ వా. సీతారామ రెడ్డిగారు ఎస్టేట్ల రద్దు చట్టము శక్షన్ 40 సబ్ శక్షన్ (2) క్రింద చేయబడిన నియమముల ముసాయిదాను ఆమోదించవలెనని ప్రతిపాదించిరి.

శ్రీ ఆర్. వి. స్వామినాథన్ సంశయములకు సమాధాన మిచ్చుచూ రైతుల హక్కులను ప్రభుత్వము రక్షించగలదనియు, శిస్తు తగ్గింపు పని 1950 మార్చికి పూర్తి కాగలదని రివిన్యూ మంత్రి తెలిపిన మీదట ముసాయిదా నియమములను అసెంబ్లీ ఆమోదించెను.

### వినోద స్థలముల సవరణ బిల్లు

తరువాత డాక్టర్ టి.యస్.ఎస్. రాజన్ ప్రతిపాదించిన వినోద స్థలముల సవరణ బిల్లును అసెంబ్లీ చర్చ ఏమీ లేకుండనే ఆమోదించెను.

మదరాసు కమర్షలు క్రాప్స మార్కెటుల సవరణ బిల్లు కూడ చర్చ లేకుండ అంగీకరించబడెను.

గౌ॥ మాధవ మీననుగారు మద్యనిషేధ చట్టమునకు సవరణ బిల్లు ప్రతిపాదించి, నేరంచేసినవాని పేరు, చెప్పేవారి పేరు బహిరంగంగా ప్రకటింప నవసరంలేదని, ఇంఫార్మరు అని ఉన్న చోటులనని యీ సవరణ విధించుచున్నదనియు చెప్పిరి.

పి. నటేశముదల్యారుగారు, ప్రతికూలంగా మాట్లాడుచు, పేరు తెలియనివ్వక రిపోర్టు చేసినంత మాత్రమున పోలీసులు కేసుచేసి ప్రజలను హింసించుటకు యిది ఉపయోగపడుననిరి.

బి. ఆనంతాచారిగారు, కొన్ని సంశయములను సూచించిరి. బి. ఎస్. మూర్తిగారు, ఇంఫార్మరులు (నేరంగూర్చి మొదట పోలీసువారికి తెలిపేవారు) యితరులపై ద్వేషంవుండికూడ ఫిర్యాదులు చేయగలరనియు, ఏలూరులో కాఫీహోటలులో అరువు యివ్వనందున హోటలు యజమాని త్రాగుబోతని ఒకడు చెప్పగ ప్రొహిబిషను ఉద్యోగులు కేసుచేసిరనియు తెలిపిరి.

ఎన్. ఎస్. వరదాచారిగారు, యిట్టి విషయాలుఅతిజాగ్రత్తగ విచారించాలనిరి, నేరం తెలిసినవాడు పోలీసుకి తెలిపినపుడు పేరు చెప్పుటకు భయపడ నవసరంలేదు, ఆ పేరు మేజస్ట్రేటుకు కూడ తెలుప నవసరంలేదని శాసించుట సబబు కాదనిరి.

హుస్సేనుగారు, మద్యనిషేధం జయప్రదంగా నుండుటకై ప్రభుత్వంవారికి ప్రజలంతా యిట్టి చట్టమును బలపరచవలెననిరి. టి. ఎస్. పట్టాభిరామునుగారు, సేలంజిల్లా దొంగసారాయి వ్యాపారానికి పేరు పడిందనియు, అది వృత్తిగా కొందరు అనుసరించుచున్నారు. కనుక, వారినిగూర్చి తెల్పుటకు ప్రజలు భయపడుదురు గనుక, యీ చట్టం చాల అవసరమనిరి.

అబ్దులు హమీదుఖానుగారు చట్టమును ఎదిరించిరి. పి. కందస్వామిగారు బలపరచిరి. ఇబ్రహింగారు ప్రతికూలంగా మాట్లాడిరి.

ఎం. ఎస్. మహీదుగారు, మద్యనిషేధ చట్టానికి ప్రతి సమావేశమునందు ఒక సవరణ తెచ్చి పెడుతున్నారని, నిషేధ విధానం విఫలమగుచున్నదని రుజువగుచున్నది. ఈ చట్టం నైతిక భీరువులను తయారుచేయుచున్నదనిరి. పేరు చెప్పభయపడినవారిని రక్షింపకేల. చిన్న ఖాజీరుగారు కన్నియప్పనుగారు చట్టమును బలపరచిరి. భీగం అమీరుద్దీనుగారు ప్రొహిబిషను ఉద్యోగులకు పోలీసు ఉద్యోగులకు ఉన్న అధికారాలన్ని యివ్వడం అవసరమనిరి.

డా॥ రామచంద్రరావుగారు, నేరము లంచితేయువారు ఘరానా మనుష్యులుగా నుండాలనిరి. అన్వరుగారు యీ చట్టము చేసినంతమాత్రమున, వాని పేరు తెలియకుండా వుండదనిరి. గ్రామాలలో అట్టివారిని కుక్కను తరిమినట్లు తరుముతారనిరి.

మంత్రి మాధవమీననుగారు బదులు చెబుతూ, మద్యనిషేధం విఫలం కావాలని కోరే నటేశనుగారు యీ చట్టాన్ని ఎదిరించుట వింతికాదుగాని, దొంగ వ్యాపారాన్ని బలవంతంగా వారింపరాదని హమీదుఖానుగారు అనుట చాల వింతగానున్నదనిరి. అబ్కారీ ఉద్యోగులకున్న అధికారంమే యిపుడు ప్రొహిబిషను ఉద్యోగులకు యిచ్చుచున్నాము. నైతిక బలహీనత, దొంగను చూపుటకు సంబంధించినదని ప్రతినేరం విషయంలోను యిట్టి రక్షణ ప్రజలకు ఉన్నది. నేరం నిలుపదలచినవారు సమాచారం పోలీసువారికి తెలుపుటకు జంకుతారు గనుక వారిపేరు బయట పెట్టరాదు రక్షణ యుండుట అవసరమనిరి.

మూడవ ప్రతిపాదనలో నటేశ ముదల్యారుగారు, నిషేధం క్రమేణ జరగాలంటేనిగాని, సూచనచేసిరి. 450 మంది గ్రామ ఉద్యోగులను నిరుద్యోగులుగా చేసి, బలవంతాన నిషేధం అమలు జరుపుచున్న ప్రభుత్వంగారు, ప్రజలంతా అనుకూలంగానున్నారని చెప్పలేరనిరి. ఎన్. ఎస్. వరదాచారిగారు, కొన్నేండ్లనుండి నిషేధ చట్టం అమలు జరుగుచుండగా యిపుడీ చట్టమునకు అవసరమెందుకు వచ్చినదనిరి. ఇందువల్ల గ్రామాలలో కక్షలు పెరుగ వచ్చుననిరి. మేజస్ట్రేటుకైనా ఇంఫార్మెంటు పేరు తెలుపాలనిరి.

మాధవమీననుగారు, ప్రజలిందుకు అనుకూలంగానున్నారో లేదో వచ్చే ఎన్నికలలో తెలియగలదనిరి. చట్టం అంగీకరించబడెను. సభ ఫలహారములకు ముగిసెను.

## మైసూరు మంత్రివర్గం రాజీనామా

బెంగుళూరు, డిసెంబర్ 15: మైసూరు మంత్రివర్గం రాజీనామా యిచ్చారు. ప్రధాన మంత్రి కె. సి. రెడ్డిగారు రాజీనామాను మహారాజాకు ఈవేళ అందజేశారు. క్రొత్త మంత్రివర్గం యేర్పడేవరకూ బాధ్యత నిర్వహిస్తూ వుండవలసిందిగా మహారాజా వీరిని కోరారు. ఈ రోజుతో శాసనసభలు రెండూ రద్దయిన కారణంగా ఇలా జరుగ వలసివచ్చింది.

డిశంబరు 17 వ తేదీన క్రొత్త శాసనసభానాయకుని యెన్నిక జరుగుతుంది. ఈ నాయకత్వానికి కె. సి. రెడ్డిగారూ, కె. హనుమంతయ్యగారూ పోటీచేస్తారని అనుకుంటున్నారు.

## తిరుపతిలో మ్యూజియం
### ఈ సంవత్సరములోగా ప్రారంభించుటకు దేవస్థాన సంఘ నిర్ణయం

మద్రాసు, డిసెంబరు 16: తిరుమల తిరుపతి దేవస్థాన సంఘం వారు నిన్న సంఘ అధ్యక్షులు కె. వెంకటస్వామి నాయుడు గారి అధ్యక్షతను కాస్మాపాలిటన్ క్లబ్బులో సమావేశమైనప్పుడు తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో భాగంగా యీ సంవత్సరంలోపల ఒక మ్యూజియంను ప్రారంభించుటకు నిర్ణయించారు. సంస్కృత శబ్దార్థ సర్వస్వాన్ని తయారు చేయుటకు కావలసిన ధనమును మంజూరు చేశారు.

## చక్కెర రేషన్ హెచ్చింపు

మద్రాస్, డిసెంబర్ 16: నెలకు వంద రూపాయలకు పైబడిన జీతములు గలవారికి ఇస్తున్న సప్లిమెంటరీ చక్కెర రేషన్‌ను మరొక 3 పలాలు పెంచుటకు ప్రభుత్వం నిశ్చయించినది. అంటే వారానికి మనిషి ఒకరికి బేసిక్ రేషన్ 2 పలాలు, సప్లిమెంటరీ రేషన్ 6 పలాలు ఇస్తారన్నమాట 100 రూపాయలకు తక్కువ జీతాలుగలవారికి మాత్రం వారానికి మనిషి ఒకరికి 2 పలాలు మాత్రమే వెనకటిమాదిరిగా ఇవ్వబడుతుంది.

ఈమార్పు డిసెంబరు 18 తే ఆదివారం నుంచి అమలు జరగవచ్చును.

## న్యాయ కార్యశాఖల విభజన
### మాజిస్ట్రేటుల నియామకం

మదరాసు, డిశంబర్ 16: న్యాయ కార్యశాఖల విభజనను 1950 జనవరినుండి మరి 4 గు జిల్లాలలో అమలు జరుపు సందర్భమున ప్రభుత్వము ఈ జిల్లాలలో మాజిస్ట్రేటును నియమించెను.

ఈ విభజన అనంతపురం, బళ్ళారి, చిత్తూరు, తిరునల్వేలి జిల్లాలకు అమలు జరుపబడెను.

బళ్లారి, అనంతపురం జిల్లాలలో సబ్ డివిజనల్ మాజిస్ట్రేటులు, జిల్లా మునసబులుగా కూడ వ్యవహరించెదరు.

న్యాయ కార్యశాఖల విభజనకు సంబంధించిన మంత్రివర్గ ఉపసంఘము నిన్న సమావేశమై 3 గురు జిల్లా మాజిస్ట్రేటులను ఆరుగురు సబ్ డివిజనల్ మాజిస్ట్రేటులను, 36 సబ్ మాజిస్ట్రేటులను, 4 గురు అడిషనల్ ఫస్టుక్లాసు మాజిస్ట్రేటులను నియమించెను.

## వేరుశనగ పండేభూమి విస్తీర్ణం పెరుగుదల

న్యూఢిల్లీ, డిశంబరు 15: "వేరుశనగ పండించే భూమి విస్తీర్ణం యీ యేడు 7.0 పెరిగింది. 1948-49 లో వేరుశనగ వేసిన భూమి విస్తీర్ణం 7532 వేలఎకరాలు" 49-50 లో 9016 వేల ఎకరాలు. వేరుశనగవేసే తరుణంలో వాతావరణపరిస్థితులు అనుకూలంగా ఉండటం, నూనెగింజలధరలు హెచ్చుగానుండటం యిందుకు కారణములు

# జరూసలెంపై అంతర్జాతీయ పరిపాలన సమస్య

## 10 రోజులలో శాసనం

లేక్‌సక్సెస్, డిసెంబరు 16: జరూసలెం నగరంపై అంతర్జాతీయ పరిపాలన నెలకొల్పేందుకు సంబంధించిన, ఒక పరిపాలన చట్టాన్ని వచ్చే 10 రోజుల్లో తయారుచేయుటకు సమితి ధర్మకర్తృత్వ సంఘం నిశ్చయించింది. గురువారంనాడు ధర్మకర్తృత్వ సంఘం రహస్యంగా సమావేశమౌతుంది.

ఇదివరకున్న ముసాయిదా చట్టాన్ని, ప్రస్తుత పరిస్థితుల కనుగుణంగా మార్చడం ధర్మకర్తృత్వసంఘ పెద్దల కర్తవ్యం. సంఘ సమావేశాలలో పాల్గొనుటకు, ఈజిప్టు, సిరియా లెబనాన్‌లకు అనుమతి యివ్వబడింది.

ఇజ్రాయిల్ ప్రభుత్వం యీ సమావేశంలో పాల్గొనదలచినట్లు యింతవరకు తెలుపలేదు.

## ఇజ్రాయిల్ ప్రధాని హెచ్చరిక

ముందు ముందు, యూదులకు చాలా గడ్డురోజులున్న విసూమా అని ఇజ్రాయిల్ ప్రధాని డేవిడ్ బెన్ గ్యూరియన్, యివ్వాళ, జరూసలెంలో యూదులను హెచ్చరించాడు.

టెల్‌అవీవ్‌నుంచి ఇజ్రాయిల్ ప్రభుత్వ కార్యాలయాలను, జరూసలెం మార్చుటకు ప్రభుత్వం గతరాత్రి చేసిన నిర్ణయం విషయం చెబుతూ, 'కని విని' యెరుగని ఒక రాజకీయ సంఘర్షణ ప్రారంభం కాబోయే సమయంలో ఉన్నాము. మూడు బలీయమైన శక్తులు,-అరబ్ ప్రపంచం, కాథలిక్ ప్రపంచం కమ్యూనిస్టు ప్రపంచం - చేతులుకలిపి మన్నెదుర్కొంటున్నవి" అని అన్నాడు.

## ఇండొనీషియాకు అధికారప్రదానం

### 27 వ తేదీ ఉత్సవానికి అనుకూల పరిస్థితులు

బటేవియా డిసెంబరు 14: ఇండొనీషియన్ రిపబ్లికన్ పార్లమెంటులో సహా అంతా హేగ్ ఒడంబడికను అంగీకరించారు గనుక డిశంబరు 27వ తేదీనాడు అధికార ప్రదానం జరగడానికి సక్రమమైన మార్గం ఏర్పడిందని పరిశీలకులు అంటున్నారు.

హేగ్ ఒడంబడికను అంగీకరించడమే కాకుండా, తమ అధికారాన్ని కూడా ఇండొనీషియా సంయుక్త రాష్ట్రాల పార్లమెంటు పరం చేయడానికి రిపబ్లికన్ పార్లమెంటు నిశ్చయించింది.

పోతే ఇక డచ్చిపార్లమెంటు ఎగువ సభవారు కూడా ఈ ఒడంబడికను అంగీకరించడంతో అధికార ప్రదానానికి ముందు జరుగవలసిన తతంగం అంతా పూర్తి అయిపోతుంది.

ఇక ఇండొనీషియా అధ్యక్షునికి ఎన్నిక ఒకటివున్నది. అది డిశంబరు 18న జరగాలని పూర్వం నిశ్చయించారు గాని, ఇప్పుడు ఆ తేదీని మర్చుచేశారు. అందువల్ల ఈఎన్నిక డిశంబరు 17న జరుగుతుంది.

## ఇండొనీషియాలో ప్రథమ హై కమిషనర్

హేగ్, డిశంబరు 14:— డాక్టర్ హెచ్. యం. హెరిస్పి ఫేల్డను, డచ్ ప్రభుత్వం ఇండొనీషియాలో మొదటి డచ్ హైకమిషనర్‌గా నియమించుతున్నది. ఈయన ప్రస్తుతం, "యూరపియన్ పునర్నిర్మాణ కార్యక్రమంలో డచ్ కమిషనర్‌గా పని చేస్తున్నారు. అయితే వీరు ఎక్కువకాలం ఇండొనీషియాలో వుండరు. కారణ మేమంటే, ప్రస్తుతం ఆయన నిర్వహించుచున్న ఉద్యోగం చాలా ప్రధానమైనది కావటంచేత డచ్ ప్రభుత్వం వీరిని యెక్కువకాలం ఇండొనీషియాలో వుంచటానికి యిష్టపడలేదు.

వాలెండు వచ్చే ఇండొనీషియా హై కమిషనర్ విషయం ఇంకా నిర్ణయం కాలేదు.

## యూరోపియన్లకు డా॥ సుకర్నో హామీ

జోగ్జకర్తా, డిసెంబరు 16: ఇండొనీషియాలో నివసించే డచ్చివారు, యూరోపియన్లు, శాసనాలకు కట్టుబడి ఉన్నంతవరకూ ఇండొనీషియా 'సెరికట్' ప్రభుత్వం (సంయుక్త ఇండొనీషియా) వారి హక్కులను కాపాడుతుందని రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ సుకర్నో హామీ ఇచ్చాడు.

రిపబ్లికన్ రేడియోలో ప్రసంగిస్తూ డచ్చివారు స్నేహితులుగా ఉండటంవల్ల ఇండొనీషియాను తమ పక్షాన నిలుపుకో గలరు కాని పాలకులుగా ఆ పనిని చేయలేరు." అని ఆయన హెచ్చరించాడు.

1945 లో రిపబ్లికును స్థాపించిన తరు వాత డచ్చివారిపట్ల అతడు మిత్రభావాన్ని ప్రకటించటానికి ఇదే మొదటిసారి.

"డచ్చివారు, యూరోపియన్‌లు (యూరపియన్-ఆసియన్ జాతుల మిశ్రమం) డచ్చివారితో సహకరించిన ఇండొనీషియన్‌లు మొదలైనవారి భద్రత విషయమై ఇండొనీషియా ప్రపంచాభిప్రాయానికి బాధ్యత వహిస్తుంది. డచ్చిసైన్యం, పోలీసుదళాల్లో పనిచేసిన ఇండొనీషియన్‌లు నూతన రిపబ్లిక్ సైన్యంలో చేరే అవకాశం ఇవ్వబడుతుంది. అయితే వారు తటపటాయింపు వైఖరిని వదలుకోవాలి డచ్చివారితో సహకరించినవారిపై కసి తీర్చుకొనటం మా పని కాదు."

# జాతీయ చైనా సైనికదళాలు బావ్ దాయ్ సైన్యంలో సమైక్యం?

## సన్నాహాలు జరుగుతున్నట్లు ప్రెసిడెంట్ లీ సన్నిహిత వర్గాల ప్రకటన

హాంకాంగ్, డిశంబరు 15: జనరల్ పాయ్ కింద పనిచేస్తున్న రెండు కోమింటాంగ్ సైన్యాలను అన్నాం, మాజీచక్రవర్తి బావ్ దాయ్ సైన్యాల్లో చేర్చడానికి అదివరకే ఏర్పాట్లు జరిగినాయని ప్రసిడెంటు లీకి సన్నిహితవర్గాలవారు చెబుతున్నారు.

ఇటువంటి తతంగం ఏదో జరుగుతున్నదని ఇతఃపూర్వం కమ్యూనిస్టులు చేసిన ఆరోపణలు ఈవార్తా నిజమే అయినయి.

ఇప్పుడు ఈ విషయాన్ని బయటపెట్టిన వ్యక్తులు హైనాన్ నుంచి ఇవ్వాళే ఇక్కడకు వచ్చారు. అచ్చట వారు జనరల్ పాయ్ తో సంభాషించి వచ్చారు.

జనరల్ పాయికి వీట్‌నాం సేనాని వ్రూహాంగ్ ఛింగ్ కు మధ్య జరిగిన సంప్రదింపులకు ఫలితంగా ఈ ఏర్పాట్లు జరిగినట్లుకూడా వీరు పేర్కొంటున్నారు.

ఈ ఏర్పాట్లకు ఫలితంగా ఇండో చైనావారు ఈ సైన్యాలను వాలంటరీ దళాలుగా తమలో సైన్యాల్లో చేర్చుకొని డా॥ హోతో జరిగే యుద్ధంలో ఉపయోగిస్తారు.

జనరల్ పాయ్ సైన్యాలు కొన్ని లంగ్ ఛౌదగ్గర సరిహద్దులుదాటి ఇండో చైనాలోకి పోతాయి. మరికొన్ని క్వాంగ్సీలోనేవుండి గరిల్లాపోరాటాన్ని సాగిస్తాయి.

ఫార్మోజాకు ప్రభుత్వాన్ని మార్చిన అనంతరం చైనా జాతీయవాదులు అక్కడ ఆశ్రయాలనుండి నాంకింగ్, ఛింకింగ్, ప్రభృతి మిలిటరీ స్థావరాలమీద విమాన దండయాత్రలు చేసి రావడం ప్రారంభించాయి.

చుంకింగ్‌ను ఖాళీచేసిపోయే ముందు కోమింటాంగ్ అధికారులు దాదాపు 600 మంది రాజకీయ ఖైదీలను ఉరితీసి మరి పోయినట్లు కమ్యూనిస్టు పత్రికలు వ్రాస్తున్నాయి. చైనా అంతరంగిక విషయాలు బాగా తెలిసినవారు ఈ వార్తలు నిజమే అని అనకపోయినా, చుంకింగ్ లో కమ్యూనిస్టులను, కమ్యూనిస్టు సానుభూతిపరులను మరికొంతమంది తీవ్రవాదులను ఖైదులో వుంచినమాట మాత్రం నిజమేనని అంటున్నారు.

కాని కమ్యూనిస్టు పత్రికలు మాత్రం ఈహత్యాకాండ నవంబర్ 27 తేదీ జరిగిందని, నిర్బంధ ప్రదేశాల్లోనే వారిని గైపుళ్లతోను, మెషన్ తుపాకులతోను కాల్చి చంపి వేశారని పేర్కొంటున్నాను.

ఇక్కడకు వస్తున్న మరికొన్ని వార్తలనుబట్టి కమ్యూనిస్టు సైన్యాలు చెంగ్టూ పరిసరాలకు చేరుకున్నట్లు తెలుస్తున్నది. నగరంచుట్టు ప్రక్కలనే కాకుండా నగా నగరంలో కూడా యుద్ధం ఒక మాదిరిగా జరుగుతున్నట్లున్నూ, నగరంలో దుకాణాలన్నీ మూతపడి, బజార్లన్నీ నిర్జనంగా ఉన్నట్లున్నూ కూడా వార్తలు వస్తున్నాయి.

షెజ్‌వాన్, సికియాంగ్ రాష్ట్రాలలో కోమింగ్‌టాంగ్ సైన్యాలలో తిరుగుబాట్లుబయలుదేరిన సంగతులు అబద్ధం కాదని నేను తెలిసివచ్చింది. కోమింటాంగ్ వర్గాలవారే ఇప్పుడు ఈ తిరుగుబాట్లు జరిగినమాట నిజమేనని అంగీకరిస్తున్నారు గాని, తమ సైన్యాలు వాటిని అణచివేసినట్లు మాత్రం పేర్కొంటున్నారు.

## ఫ్రెంచి విదేశాంగ శాఖ నిరాకరణ

పారిస్, డిసెంబరు 15:

జనరల్ పాయ్ సైన్యాలువచ్చి ఇండో—చైనా సైన్యాలలో చేరనున్నవన్న వార్తను ఫ్రెంచి విదేశాంగ కార్యాలయంవారు జనులలోకి తీసుకోవడం లేదు.

ఇండో చైనాలో ప్రకాశించిన కోమింటాంగ్ సైనికులను నిరాయుధం చేసిన పద్ధతిని పరిశీలించిన ప్రతివాళ్లకు ఫ్రెంచివారు, ఇండో — చైనావారు ఈ విషయం ఎంత తటస్థంగా వుండదలచింది వ్యక్తమౌతూ వున్నదని కూడా వారు పేర్కొంటున్నారు.

చైనా జాతీయ సైన్యాలు ఇండో చైనా సరిహద్దులు దాటవస్తే ఏమి చేస్తాము అన్న విషయాన్ని గూర్చిచాలా సార్లు విస్పష్టంగా ప్రకటించి వున్నాము.

ఇప్పుడు, మరెప్పుడు కూడా ఆప్రకటనల మీదే మేము నిలబడ దలచుకున్నాం, అని వారు ఉద్ఘాటించారు.

ఇండో చైనా సరిహద్దులను దాటి వచ్చిన కోమింటాంగ్ సైనికుణ్ణి నిరాయుధం చేయడం మావిధి. అంతర్జాతీయ ధర్మ నియమాల ప్రకారమే మేము నడుచుకోదలచుకున్నాం.

## ఫార్మోజాదీవి భవిష్యత్తు

### అమెరికా ప్రభుత్వవైఖరి

వాషింగ్‌టను, డిసెంబరు 14: చైనా జాతీయప్రభుత్వ పక్షసేనలు చైనాదేశం విడిచి ఫార్మోజా ద్వీపమునకు చేరినవి. రెండవ ప్రపంచ సంగ్రామములో జపాను వారిని ఓడించిన పిదప ఇది అమెరికా వారి ఆక్రమణలోనికి వచ్చినది. కనుక ఈ ఫార్మోజాదీవియొక్క భవిష్యత్తు ఏమిటి అని అమెరికన్ ప్రభుత్వ విదేశాంగకార్యదర్శి యగు డీన్ అచిసన్ గారిని పత్రికా ప్రతినిధులు ప్రశ్నింపగా యీక్రిందరీతిగా ప్రత్యుత్తర మిచ్చిరి.

ఫార్మోజాదీవి అమెరికాచే జయింపబడిన ప్రాంతమే. కాని అదికూడా జర్మనీ కలిగియున్నటువంటి ప్రతిపత్తినే కలిగియుండవలెను. అది జయించబడిన ప్రాంతమైనను అది జపానురాజ్యములో చేరిన భాగమై యున్నది. అచటికి అమెరికను సేనలు పంపబడునా ఆదేవిషయమై నేనే మియు చెప్పను. కెయిరో ఒడంబడిక ప్రకారము ఫార్మోజా దీవిని చైనాకు యివ్వవలసియుండును. ఒకవేళ ఫార్మోజా దీవిమీదకు చైనా కమ్యూనిస్టు సేనలు దండెత్తి వచ్చినయెడల అప్పుడు దానిస్థితి జర్మనీవంటిదని భావింపవీలులేదు. ఇంతకంటె ఎక్కువ విషయాలు ఊహాగానం చేసి చెప్పడానికి ప్రస్తుతము వీలులేదు.

# పోలీసులపై నాటు బాంబుల ప్రయోగం

## కమ్యూనిస్టు కార్యాలయ సోదా సందర్భంలో

విరుద్ధనగరు, డిసెంబరు 15: గతరాత్రి కమ్యూనిస్టుపార్టీ యొక్క జిల్లా కార్యాలయాన్ని సోదా చేయడానికి వచ్చిన పోలీసు దళంపై మూడు నాటు చేతిబాంబులు విసరబడగా ఇద్దరు పోలీసు అధికారులకు కొద్ది గాయాలు తగిలినవి.

సోదాచేసిన ఇంటి తలుపులో పలినుంచి బిగించి ఉండడంచేత తలుపు పగలగొట్టి లోపల ప్రవేశించి పోలీసులు ఇంటిలో ఒంటరిగా వున్న కృష్ణన్ అనేవాణ్ణి ఎరెస్టు చేశారు. ఈ ఇంట నాటుబాంబులు చేసే రసాయనాలూ, కమ్యూనిస్టుపార్టీ సాహిత్యమూ దొరికిందట.

అనంతరం పట్టణంలో మరి రెండు ఇళ్లు సోదా చేయగా బండెడు కమ్యూనిస్టుపార్టీ రికార్డులూ, అచ్చు యంత్రమూ దొరికినవట.

ఇవి జరగక పూర్వమే పోలీసులు జోసెఫ్ అనే వాణ్ణి ఎరెస్టు చేశారు. మధురలో జరిగిన హెడ్‌కనిస్టేబులు హత్యతో ఇతనికి సంబంధం ఉన్నదట.

## ఇండియా అధ్యక్షునికి ప్రత్యేక పతాకం

న్యూఢిల్లీ, డిసెంబరు 15: జనవరి 26-వ తేదీనుంచి ఇండియాఅధ్యక్షుడు పదవి నధిష్ఠింపగానే ప్రభుత్వ భవనంపైన అధ్యక్షుని ప్రత్యేక జెండా ఎగురుతుంది.

ఈజెండా నాలుగుభాగాలుగా విభజించబడుతుంది. రెండు భాగాలు (ఏ మూలల ఉండేవి) నీలంగానూ, మిగిలిన రెండూ ఎర్రగానూ ఉంటవి. నాలుగు విభాగాలలోనూ నాలుగు చిహ్నాలు— ఇండియా ప్రభుత్వ చిహ్నమూ, ఏనుగా, త్రాసూ, పద్మమూ—బంగారంతో లిఖించబడతవి.

రాష్ట్రగవర్నర్లకూ, రాజ ప్రముఖులకూ కూడా ప్రత్యేక జెండాలుంటవి. ఇవి జనవరి 26 నుండి అమలులోకి వస్తవి. ఈ జెండాలు కాషాయవర్ణం కలిగివుంటవి. వాటిపై ప్రభుత్వ చిహ్నము, దేవనాగరి లిపిలో రాష్ట్రం లేక సంస్థానం పేరూ ఉంటవి. (గ్లోబ్)

## చలామణిలో 16·15 కోట్ల పెరుగుదల

బొంబాయి, డిశంబరు 14: రిజర్వు బ్యాంకు లెక్కల ప్రకారం, 16.15 కోట్ల రూపాయలవిలువగలనోట్లు, లోగడకంటే అదనంగా చెలామణిలోకివెళ్ళినట్టు ప్రకటించారు. బ్యాంకు డిపాజిట్లు ఆమొత్తానికి తగ్గిపోయినై.

# కలకత్తా జైలులో పోలీసులకు కమ్యూనిస్టులకు సంఘర్షణ

## 44 మందికి గాయములు

కలకత్తా, డిశంబరు 15: నేటిఉదయము ప్రెసిడెన్సీజెయిలులో కమ్యూనిస్టు డిటెన్యూలకును, పోలీసులకును జరిగిన సంఘర్షణలో 44 గురు, 14 మంది పోలీసులు 30 మంది కమ్యూనిస్టులు గాయపడిరి. కమ్యూనిస్టుల పడకటెంటిని మామూలుమాదిరిగా సోదాచూచుటకు చెరసాలాధికారులు నేటిఉదయము డిటెన్యూలవాద్దకు వెళ్ళిరి. కమ్యూనిస్టులు బల్లలు, కుర్చీలు మున్నగువానిని ద్వారమునకు అడ్డముగాపెట్టి జెయిలుఅధికారులను లోపలికి రానివ్వకపోయిరి. ఈ అడ్డంకులను తీసివేయుటకు చెరసాలాధికారులు ప్రయత్నింపగా డిటెన్యూలు తమచేతికి అందిన ఆయుధములతో చెరసాలాధికారులపై దాడిచేసిరి.

చెరసాలాధికారులు రెండుబారులు తుపాకులు పేల్చిరి. ఎవ్వరికి గాయములు తగులలేదు. అడ్డంకులను తీసివేయుటకు ప్రయత్నము విఫలముకాగా చెరసాలాధికారులు పోలీసులసహాయముకోరిరి. పోలీసులు డిటెన్యూల పడకటెంటిదగ్గరకు రాగానే డిటెన్యూలు వారిపైసీసాలు, టంబ్లర్లు ఇతరపాత్రసామగ్రి, నిప్పంటించబడిన తెలగడాలు మున్నగువానిని ప్రయోగించిరి. పోలీసులు హెచ్చరిక చేసిరి. కాని యిందువల్ల ప్రయోజనము లేక పోయెను. డిటెన్యూలు తమ దాడిని మరింత తీవ్రముగా సాగించిరి. అంతట పోలీసులు బాష్పవాయు తోటాలు కాల్చిరి. త్వరలోనే పోలీసులు అడ్డంకుల నన్నిటిని తీసివేసి లాఠీ చార్జి చేయగా ఖైదీలు లొంగి పోయిరి.

ఈ సమయముననే స్త్రీ కమ్యూనిస్టు డిటెన్యూ వార్డులో కూడ, అల్లరులు ప్రారంభ మయ్యెను. స్త్రీ డిటెన్యూలు ద్యూటీలో నున్న స్త్రీవార్డర్లను రెక్కలు విరిచి కట్టి బందీలుగా చేసిరి. వార్డు ద్వారమార్గములకు అడ్డముగా కుర్చీలు, బల్లలు మున్నగు వానిని పెట్టిరి. కాని త్వరలోనే చెరసాలాధికారులు శాంతి నెలకొల్ప గల్గిరి.

గాయపడిన వారికి చెరసాల ఆసుపత్రిలో చికిత్స చేసిరి.

### ప్రభుత్వ ప్రకటన

నేటి అల్లరుల విషయమై ప. బెంగాలు ప్రభుత్వమువారు ఈ క్రింది ప్రకటన గావించుచున్నారు: "ఇటీవల స్పెషల్ కోర్టుకు విచారణకై తీసికొని పోబడిన కమ్యూనిస్టు డిటెన్యూలు అచ్చట అల్లరి చేయుటచేత వారు తప్పించుకొని పోకుండా చేయుటకు పోలీసులు చేబేడీలు వేయవలసి వచ్చెను. వారిని త్రాళ్లతో కట్టి వేయవలసి వచ్చెను. 'ఇక ముందు చేబేడీలు వేయము' అని ప్రభుత్వమువారు వాగ్దానము చేయకపోయిన యెడల మే మెవ్వరము రాము' అని కమ్యూనిస్టు డిటెన్యూలు తెలిపిరి. కోర్టుకు తీసికొని వెళ్లినప్పుడు సరిగా ప్రవర్తించెదము అని డిటెన్యూలు ఒడంబడిక నిచ్చిన గాని తాము యిట్టి హామీ యొసంగజాలమని ప్రభుత్వమువారు డిటెన్యూలకు తెలిపిరి."

ఈ సంఘటనలవల్ల కోర్టులో కమ్యూనిస్టు డిటెన్యూల విచారణ ఆగిపోయినది.

## ఆంధ్రరాష్ట్ర హిందూ మహాసభ

విజయవాడ, డిసెంబరు 15: ఆంధ్ర రాష్ట్ర హిందూమహాసభ అధ్యక్షపదవి నుండి తాను విరమించుకొన్నానని పంగంగికేశవరావుగారు తెలియజేస్తున్నారు.

# ఇండోచైనాలో వేలాదిగా ప్రవేశించిన జాతీయ చైనా సైనికుల ఖైదు

## ఆయుధాలన్నీ ఫ్రెంచి అధికారుల వశం

సైగాన్, డిశంబరు 14: కొన్నివేలమంది కోమింటాంగ్ సైనికులు ఇండోచైనాలోకి దూసుకుపోగా అక్కడ ఫ్రెంచివారు వారిని నిరాయుధులనుచేసి ఖైదీలుగా పట్టుకున్నారు.

క్వాంగ్సే రాష్ట్రంలో పోరాడుతున్న సైన్యాలు మాత్రం హైనాన్ దీవికి తరలిపోతున్నాయి. ఈ సేనలకు అధిపతియైన జనరల్ పాయ్ అక్కడ వీరిని తిరిగి యుద్ధానికి సన్నద్ధంచేసే ప్రయత్నాలు చేస్తున్నారు.

ఇట్లా హైనాన్‌దీవికి పోతూ ఇండోచైనా సముద్రజలాల్లో ప్రవేశించిన రెండు కోమింటాంగ్ నావలను ఆటకాయించి, ఫ్రెంచివారు వానిలోవున్న 150 మంది సైనికులను గూడా పట్టుకున్నారు.

ఇండోచైనాలోని ఫ్రెంచి అధికార్లు, మాజీరాజు బావ్‌దాయ్ సంతకాలుచేసి జారీచేసిన ఉత్తర్వులను పురస్కరించుకొని ఈ కర్మకాండఅంతా జరుగుతున్నది.

హాంకాంగ్‌నుంచి వెలువడే ఒకపత్రిక ఈ సైనికులను గూర్చి మరోవిధంగా వ్రాస్తున్నది. చైనాలోంచి ఇండోచైనాలోకి దూసుకుపోతున్న సైనికులంతా బావ్‌దాయ్ సైన్యంలో చేరడానికి పోతున్నట్లు ఈ పత్రిక ఆరోపిస్తున్నది. ఇది కమ్యూనిస్టులపట్ల సానుభూతిగల పత్రిక.

జరుగుతున్నాయి గనుక, ఆ ఆలోచనలు పూర్తిఅయి, ఒప్పందాలు వ్రాసుకొనేదాకా ఆయన పారిస్‌కు పోక పోవచ్చునని వీరు చెప్పుకొంటున్నారు.

ఇప్పుడు ఒడంబడికలను తయారు చేసే నిమిత్తం ఒక కమిటీని వేసారు. వీరు తయారు చేసిన చిత్తు ఒడంబడికలను ఇంకో ఉపసంఘం పరిశీలించి సాపుదిద్దుతుంది, అనంతరం కమిటీ అంతా కలుసుకొని వీటిని ఖరారుచేస్తారు.

డిశంబరు 31 నాటికల్లా అధికార ప్రదానమూ, ఫ్రాంకో-వీట్‌నాం సంబంధాలు, విదేశాంగ విధానము మొదలైన అంశాలనుగూర్చిన సర్వాంశాలను ఈ కమిటీవారు సిద్ధం చేయగలరని అభిజ్ఞులు చెప్పుకొంటున్నారు.

అదీకాకుండా ఈలోపుగా ఇండోచైనా ప్రభుత్వంలో కూడా మార్పులు జరగవచ్చునని మరికొంత మంది అంటున్నారు. ఇప్పటిదాకా విదేశాంగ మంత్రిగావున్న న్యూయెన్‌ఫాన్ వాంగ్ ప్రధాని కావచ్చునని, బ్యూలాక్ యువరాజు విదేశాంగమంత్రి కావచ్చునని అనుకుంటున్నారు. ప్రస్తుతం వీట్‌నాం ఉపాధ్యక్షులుగా వున్న న్యూయెన్‌వాన్‌జు, వాన్ ఫ్రాన్సులో వీట్‌నాం ప్రతినిధిగా నియమింపబడవచ్చునని గూడా అనుకుంటున్నారు. కాని వీటిని ధృవపరచిన వారెవ్వరూ లేరు. అప్పుడు బావ్‌దాయ్‌కి కొంచెం విసులుబాటు చిక్కి జాతీయము అంతర్జాతీయమూ అయిన విషయాలను పట్టించుకొనే సావకాశం లభిస్తుంది.

### హైఫాంగ్‌కు జాతీయసేనాని రాక

పారిస్, డిశంబరు 14: కోమింటాంగ్ సేనానులలో ఒకడైన జనరల్ చాంగ్ చున్‌కున్‌మింగ్‌నుంచి నేడు హైఫాంగ్‌కు చేరుకున్నారు. హైఫాంగ్ ఫ్రెంచి ఇండోచైనాలో వుంది.

జనరల్ ఛాంగ్‌చున్‌ను యూనాన్‌లో రెండురోజులపాటు ఖైదీగాపట్టివుంచారు. ఈ పని చేసింది జనరల్ లూహాన్. ఈయన కమ్యూనిస్టులవైపు తిరిగిపోయాడు.

జనరల్ ఛాంగ్‌ను యూనాన్‌లో ఖైదు చేసినట్లు తెలియగానే, జనరలిజ్మో ఛాంగ్‌కైషేక్ యూనాన్ నగరాలనన్నింటిపైన బాంబులవర్షం కురిపించగలనని బెదిరించడంవల్ల యూనాన్ అధికారులు ఆయన్ను వదలిపెట్టి హైఫాంగ్‌కు పోవడానికి అనుమతించారు.

అనంతరం ఆయన వెంటనే హాంకాంగ్ విమానంలో బయలుదేరిపోయారు.

### బావ్‌దాయి సేనలతో చైనాసేనల కలయిక

హాంకాంగ్, డిసెంబరు 14: కోమింటాంగ్ చైనాసేనాని జనరల్‌పాయ్ తన సైన్యాలు బావ్‌దాయ్ సైన్యాలతో కలిసేందుకు వీలుగా ఇండోచైనాలోకి ఉపసంహరిస్తున్నట్లు పెకింగ్ రేడియో ప్రకటించింది.

ఇదేవిధమైన వార్తను 'టాకుంగ్‌పో' అనే పత్రికగూడా ప్రకటించింది. ఇది హాంకాంగ్‌నుంచి వెలువడుతుంది.

ఈ వార్తలోకన్న ఎక్కువ విశేషాన్ని ఇంకొకదాన్ని గూడా పెకింగ్ రేడియో బయట పెట్టింది. జనరల్‌పాయ్ తన సైన్యాలకు ఒక ఉత్తర్వు జారీ చేశాడని, ఆరోపిస్తూ అందులో ఈ క్రింది విశేషాలు వున్నట్లు ఆ రేడియో వెల్లడి చేసింది.

"మేము బావ్‌దాయ్‌ని బలపరుస్తున్నాం. అందువల్ల ఫ్రెంచి బలాలకు తోడ్పడటం విధిగా భావిస్తున్నాం. వారితోగూడా చేతులు కలిపి, డా॥ పరో సైన్యాలను వదిలి వేటాడమే మా ఆశయం."

"చైనాలో మాకు విరోధివర్గం వారైన కమ్యూనిస్టులు మాతోబాటు ఇండోచైనాలో ప్రవేశిస్తే, అది జటిలమైన అంతర్జాతీయ సమస్యగా తూర్పొంటుంది"

అట్లాంటి పరిస్థితి ఏర్పడటం మాకు అన్నివిధాలా అనుకూలమే. ఎందుచేతనంటే అటువంటి పరిస్థితి ఏర్పడినప్పుడు ఐక్యరాజ్యసమితి చూస్తూ వూరుకోదు.

ఇందుకు ప్రోద్బలంగా ఇంకో విషయాన్నిగూడా ఈ రేడియో వెల్లడించింది. డా॥ టి. వి. సూంగ్ ఈ మధ్య ఫ్రాన్సు వెళ్లారు. అక్కడ ఆయుధాలు అప్పు తెరం చేయడమే కాకుండా, ఇతడు పశ్చిమ రాజ్యాలవారితో కోమింటాంగ్ సైన్యాలను ఇండోచైనాలోకి ప్రవేశించనిచ్చే విషయమై సంప్రదింపులు గూడా జరిపారు అని ఆ రేడియో వెల్లడి చేసింది.

### బావ్‌దాయి పారిస్ ప్రయాణం వాయిదా

సైగాన్, డిశంబరు 14: డిశంబరు 18 నాటికల్లా పారిస్‌కు ప్రయాణం కావలసివున్న ఇండోచైనా మాజీరాజు బావ్‌దాయ్ తన ప్రయాణాన్ని వాయిదా వేసుకున్నట్లు అభిజ్ఞులు వెల్లడిచేస్తున్నారు.

ప్రస్తుతం వీట్‌నాంకు అధికార ప్రదానం విషయమై ఫ్రాన్సుతో ఆలోచనలు

# బల్గేరియా మాజీ ఉపప్రధానికి మరణశిక్ష

## బ్రిటన్, యుగోస్లావియాలతో కుట్రపన్నిన ఆరోపణ

సోఫియా డిశంబరు 14: బల్గేరియా మాజీ ఉపప్రధాని ట్రైచోకోస్టోవ్‌కు బల్గేరియా సుప్రీంకోర్టు నేడు మరణదండన విధించినది. బ్రిటన్, అమెరికా, యుగోస్లావియాలకు గూఢచారిగ పనిచేశాడనీ, యుగోస్లావ్ సహాయంతో సోవియట్ వ్యతిరేక బాల్కన్ కూటమిని ఏర్పాటు చేయాలని ప్రయత్నించాడనీ, ఇతనిమీద ఆరోపించబడినది.

అతనితోపాటు విచారించబడిన మరి 10 మందికమ్యూనిస్టు ఉద్యోగులలో 5 గురికి యావజ్జీవ శిక్ష, ముగ్గురికి 15 సం॥ల ఖైదూ, ఒకరికి 12 ఏళ్లు, మరొకరికి 8 ఏళ్లు శిక్ష విధించబడినవి.

సోవియట్ వ్యతిరేక కూటమిని యుగోస్లావ్ సైనిక సాయంతో స్థాపించటానికి తాను ప్రయత్నించలేదనీ, బ్రిటన్ తరఫున గూఢచారిగా పనిచేయలేదని కోస్టోవ్ వాదించాడు. కాని తాను, సోవియట్ యూనియన్‌కి వ్యతిరేకంగా పనిచేశాననీ, విదేశ ప్రతినిధులు రాజ్యాంగవ్యవహారాల రహస్యాలను తెలుసుకొనటంలో తోడ్పడ్డాననీ అంగీకరించాడు.

మాజీఆర్థికమంత్రి ఇవాన్ స్టెఫనోవ్ తాను 15 ఏళ్ళనుంచి బ్రిటిష్‌గూఢచారిగా కమ్యూనిస్టుపార్టీలో పనిచేశానని అంగీకరించాడు. అతడికి యావజ్జీవ శిక్ష విధించబడ్డది.

## కనీస వేతనాల చట్టం

### పార్లమెంటులో జగ్జీవన్‌రాం ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 14: కార్మికుల కనీస వేతనాల చట్టాన్ని శీఘ్రంగా అమలులోకి తేవడానికి రాష్ట్ర ప్రభుత్వాలు పాటుపడుతున్నవని శ్రామిక మంత్రి జగజీవనరాం నేడు పార్లమెంటులో చెప్పారు.

# విదేశాలనుంచి 8 లక్షల బేళ్ల పత్తి దిగుమతి చేసుకోడానికి భారతప్రభుత్వ నిర్ణయం

న్యూఢిల్లీ, డిశంబరు 14: ఇతర దేశాలనుంచి 8 లక్షల బేళ్ల ప్రత్తిని దిగుమతి చేసుకోడానికి అవసరమైన విదేశచలామణీ ద్రవ్యాన్ని కేటాయించడానికి భారతప్రభుత్వం నిశ్చయించింది.

ఈ దేశాలలో అరుదు చలామణీ ప్రాంతాలు గూడా వున్నాయి.

పై విషయాలను వెల్లడిచేస్తూ నేడు ప్రభుత్వం ఒక ప్రకటన చేస్తూ, ఇంతవరకు 2 లక్షల 20 వేల బేళ్లను అప్పుడేతూర్పు ఆఫ్రికాలో తీసుకోవడం జరిగిందని, ఇందులో బ్రిటన్ ముడిప్రత్తి సంఘంవారుగూడా కలిసివచ్చారనీ తెలియజేశారు.

ఇప్పుడు తెప్పిస్తున్న పత్తి మామూలుగా చేసుకొంటున్న దిగుమతులకన్న ఎక్కువగా వున్నది. పూర్వం 6 లక్షల బేళ్లు మాత్రమే తెప్పించేవాళ్లం. అయినా ప్రభుత్వం అవసరమైతే ఇంకా ఎక్కువప్రత్తిని తెప్పించడానికి అనువుగా విదేశ చలామణీ ద్రవ్యాన్ని కేటాయించడానికిగూడా సిద్ధంగా వుంది.

కాగా ఈప్రత్తి తయారైన బట్టలకిరీదును నిశ్చయించడంలో ప్రభుత్వం పైపత్తి యొంతకు గిట్టుబాటైంది దృష్టిలో వుంచుకుని, అందుకు తగ్గట్టుగా ధరలు నిర్ణయిస్తూ టెక్స్టయిలు పారిశ్రామికులకు దెబ్బ తగలకుండా చూస్తుంది.

అదేవిధంగా వినిమోగదార్లనుకూడా దృష్టిలో వుంచుకొని ఈప్రత్తి దిగుమతుల వల్ల బట్టల ఖరీదులు పూర్వంకే పెరిగిపోకుండా తగిన చర్యలుగూడా ప్రభుత్వం తీసుకుంటుంది.

ఇంతవరకు పైన చెప్పుకొనిన 6 లక్షల బేళ్లలోను పాకిస్తాన్‌నుంచి దిగుమతిఅయ్యే ప్రత్తిబేళ్ళను చేర్చలేదు.

దేశంలో 28 లక్షలబేళ్ల ప్రత్తి పండుతుంది. ఇందులో 2 లక్షల బేళ్ల పాటి ప్రత్తి విదేశాలకు బట్టలు తయారుచేసిపంపడానికి కేటాయించడం జరుగుతున్నది.

ఇప్పుడు మిల్లులు అన్నింటిలోనుకలుపు కొని 13 లక్షల బేళ్ల ప్రత్తి నిల్వవుంది. దిగుమతులనుగూడా కలుపుకుంటే, వస్త్ర పారిశ్రామికులకు ప్రత్తి ఎద్దడి అవుతుందని భయపడవలసిన అవసరం ఎంతమాత్రం కనుపించదు.

ఒకవేళ మనం ఎగుమతిచేస్తున్న 800 మిలియన్ల గజాలగుడ్డకన్నా ఎక్కువ గుడ్డను ఎగుమతి చేయవలసివస్తే, ప్రభుత్వం ఇంకా ఎక్కువ ప్రత్తిని తెప్పించుకొనే సావకాశం కల్పిస్తుంది.

ప్రత్తి కంట్రోలు ఉత్తర్వుద్వారా టెక్స్టయిల్ మిల్లులకు ఒక క్రమంలో చేతిమీదవున్న ప్రత్తి సరఫరా పద్ధతులను దిద్దింది. ప్రత్తి సరఫరా, పంపిణీ ధర నిర్ణయం వీటి విషయంలో టెక్స్టయిల్ కమిషనర్‌కు సర్వాధికారాలు ఈ ఉత్తర్వు వల్ల లభించాయి. కేంద్రంచేసినట్లుగా సంస్థానాలు, సంస్థాన యూనియన్లు గూడా ఉత్తర్వులు జారీచేయాలని ప్రభుత్వం ఆదేశించింది.

ఈ ప్రత్తి కంట్రోలు ఉత్తర్వులోని అంశాలను అమలుజరిపేవిషయమై ఈమధ్య ప్రభుత్వ ప్రతినిధులు, పారిశ్రామికులు కలిసి ఆలోచనలు చేసారు.

ఈ సమాలోచనల ఫలితంగా జరిగిన నిర్ణయాలను, ఈ నిర్ణయాలను పురస్కరించుకొని వారు చేసిన సిఫార్సులను ప్రభుత్వం అమలు జరపడానికి నిశ్చయించింది.

వీరి సిఫార్సులను పురస్కరించుకొని దేశంలో ప్రత్తి పంట ప్రాంతాలన్నీ 6 భాగాలుగా విభజింపబడినాయి. టెక్స్టయిల్ కమిషనర్ ఏ మిల్లుకు ఎంత కోటా కావలసింది నిశ్చయించి, తదనుగుణంగా ప్రత్తి సరఫరా అయ్యే ఏర్పాటు చేస్తారు. ఏ మిల్లుకూడా కోటాకుమించిన ప్రత్తిని కొనగూడదు. ఖాదీ పరిశ్రమ యొక్క అవసరాలనుగూడా ఈయన గుర్తిస్తారు.

ఇక త్వరలోనే టెక్స్టయిల్ కమిషనర్ ఈ కోటాలను నిశ్చయించి, తన నిశ్చయాలను రాష్ట్రాలకు, సంస్థానాలకు ఎరుకపరుస్తారని తెలుస్తున్నది.

# హైద్రాబాదు అవిభక్తంగా ఉన్నంతకాలము నిజాం పరిపాలన తప్పదు

## ఫతేమైదాన్‌సభలో జయప్రకాశ్ హెచ్చరిక

హైదరాబాదు, డిశంబరు 14: "విశాల హైదరాబాదు" వాదాన్ని ఎప్పుడూ సమర్థించవద్దని, దానివల్ల నిజాం ఇంకా పదవిలో ఉండటమే ఏర్పడుతుందనీ, సోషలిస్టు నాయకుడు జయప్రకాశ్ నారాయణ నేటి రాత్రి ఇక్కడ హైదరాబాదు ప్రజలకు ఉద్బోధించారు.

ఆయన ఉపన్యాసం వినటానికి ఫతేమైదాన్‌లో 50 వేల ప్రజలు సమావేశమయ్యారు. ఉపన్యాసానికి ముందు జయప్రకాశ్ సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుడైన స్వామీ రామానంద తీర్థతో టీ సేవించారు.

నేటి మధ్యాహ్నం ఇక్కడకు సతీసమేతంగా వచ్చిన జయప్రకాశ్ నారాయణకు హకీంపేట విమానాశ్రయం వద్ద 10 వేల మంది జనం హర్షధ్వానాలతో స్వాగతమిచ్చారు. ఎర్ర టోపీ ధరించి టాపు తీసి వేసిన నల్లటి బ్యూక్ కారులో, సంస్థాన సోషలిస్టుపార్టీ కార్యదర్శి బి. ఎస్. మహాదేవసింగుతో కూర్చుని జయప్రకాశ్ హైదరాబాదు, సికిందరాబాదు నగరవీధుల్లో ఊరేగారు. త్రోవపొడుగునా, ముఖ్యంగా కింగ్సువేలో అసంఖ్యాకమైన జనం హర్షధ్వానాలుచేశారు. ఊరేగింపు సుల్తాన్ బజారులోని నగరసోషలిస్టుపార్టీ కార్యాలయం వద్ద ఆగింది.

ఫతేమైదాన్‌లో ఉపన్యసిస్తూ హైదరాబాదు సంస్థానం ఇప్పుడున్న మాదిరిగా అవిభక్తంగానే వుంటే అభ్యుదయ నిరోధక శక్తులకది బలీయకేంద్రం కాగలదని, ప్రజలు సోషలిస్టు పార్టీని బలపరిస్తే ఒక ఏడాదిలోగా సోషలిస్టు ప్రభుత్వమేగాక ఈ దేశంలో సోషలిజమ్‌కూడా ప్రారంభమవుతుందని జయప్రకాశ్ చెప్పారు.

"ఇండియాను పారిశ్రామికం చేయడానికి విదేశీయులపెట్టుబడులను పండిట్ నెహ్రూ ఎందుకు ఆహ్వానిస్తున్నారో నాకర్థం కావటంలేదు. రాజాలకు, మహారాజాలకు, నిజాముకు కోట్లకొలది రూపాయల ధనం ఏటా ఇచ్చి వేయబడుతున్నది. భారత సంస్థానాధీశ్వరుల ధనమును దేశాభివృద్ధికి ఉపయోగించుకోవాలి.

ప్రధాన పరిశ్రమలనన్నిటినీ జాతీయం చేస్తే, వాటిపై వచ్చేలాభాలను నిర్మాణాత్మక కార్యములకు ఖర్చుపెట్టవచ్చును. ఆస్పత్రులు, పాఠశాలలు విరివిగా స్థాపించవచ్చును.

సోషలిస్టుపార్టీ అధికారానికి వస్తే నూత్న రాజ్యాంగమును చింపి పారవేస్తుంది. సామాజిక న్యాయంపై ఆధారపడిన క్రొత్తరాజ్యాంగం దాని స్థానంలో అవతరిస్తుంది.

కాంగ్రెసుసంస్థ రానురాను మతవర్గ భావపూరిత మౌతున్నది. ఆర్. ఎస్. ఎస్. పట్ల దాని వైఖరియే ఇందుకుప్రబల నిదర్శనం.

భారతీయ కమ్యూనిస్టులకు స్వదేశం కంటే మాస్కోయే ముఖ్యము, ప్రధానము."

సంస్థానప్రజలు, ముఖ్యంగాముస్లిములు సోషలిస్టుపార్టీలోచేరి దానిని బలపరచవలసిందని జయప్రకాశ్ విజ్ఞప్తి చేశారు.

నేటిరాత్రి జయప్రకాశ్ కాజీపేటకు వెళ్ళి అక్కడనుండి కొత్తగూడెం బొగ్గుగని ప్రాంతానికి వెడతారు. మొత్తం సంస్థానంలో వారం రోజులుంటారు. ఈయన 1947 మే 10వ తేదీన ఇక్కడకు వచ్చినప్పుడు, కర్బలా మైదానంలో విద్రోహకర ఉపన్యాసమిచ్చారని నిజాం ప్రభుత్వం ఈయనను సంస్థానంనుండి బహిష్కరించింది.

"రెండేళ్ళక్రిందట నన్ను బహిష్కరించడానికి కారకుడైన నిజాం నవాబు నేటికి ప్రభుత్వాధిపతిగానే ఉన్నాడు. ఆయన ఈ సంస్థానానికి ప్రతినిధికాడు. ఆయనలో ప్రజలకు కించిద్విశ్వాసమైనా లేదు. భారతయూనియన్ ప్రవేశపత్రంపై సంతకంపెట్టడానికి నవాబెవరు? ఆ పని చేయవలసింది సంస్థాన ప్రజానీకమే." అని నేటి జయప్రకాశ్ తన ఉపన్యాసంలో ఉద్ఘాటించారు.

### సిర్పూర్ మిల్లులో న్యూస్‌ప్రింటు తయారీ

#### వచ్చే ఏడాదినుండి ప్రారంభం

హైదరాబాదు, డిసెంబరు 14:— హైదరాబాదు సంస్థానంలోని ఆదిలాబాదు జిల్లాలోగల సిర్పూర్ పేపరు మిల్లులో న్యూస్ ప్రింటు కాగితాన్ని కూడా తయారు చేసే నిమిత్తమై, కోటి రూ.ల వ్యయంతో మిల్లును విస్తరిస్తున్నారు. న్యూస్ ప్రింటు ఇండియాలో తయారవటానికి ఇదే మొదటి పర్యాయమవుతుంది. క్రొత్త యంత్రం వచ్చే ఏడాది ప్రారంభంలో పనిచేయ మొదలిడుతుంది. ఇప్పుడు రోజుకు 15 టన్నుల కాగితం మాత్రమే ఇక్కడ తయారవుతున్నది. క్రొత్త యంత్రంకూడా పనిచేస్తే మొత్తం రోజుకు 0 టన్నుల కాగితం తయారవుతుంది.

## ఒరిస్సాలో డా॥ పట్టాభి పర్యటనం

### ఉత్కళవిశ్వకళాపరిషత్‌లో ఉనెల 28న ఉపన్యాసం

కటక్, డిసెంబర్ 15: కాంగ్రెసు అధ్యక్షుడు డా॥ పట్టాభి సీతారామయ్యగారు ఈ నెల 28 తేదీన భువనేశ్వర్ విమానాశ్రయంలో దిగి కటక్ వస్తారు. ప్రభుత్వ భవనంలో ఆతిథ్యం స్వీకరించి, మధ్యాహ్నం ఉత్కళ విశ్వకళాపరిషత్ స్నాతకోత్సవంలో ఉపన్యసిస్తారు.

డా॥ పట్టాభి 29 వ తేదీన కాంగ్రెసు వర్కర్ల సభలో మాట్లాడి, ఢెంకనాల్ వెడతారు. అక్కడ బహిరంగసభలో ఉపన్యసించి, బరంపురం వెళ్లి 30 వ తేదీన మహాత్మగాంధీ చిత్రము నావిష్కరిస్తారు. అక్కడనుండి 31 వ తేదీన మయూర్భంజ్ వెళ్లి కాంగ్రెసు వర్కర్ల సభలో ప్రసంగిస్తారు.

## 7 గురు కమ్యూనిస్టులకు మరణశిక్ష

### ఖాయంచేస్తూ హైద్రాబాదు హైకోర్టు తీర్పు

సికిందరాబాదు, డిసెంబరు 15: రెండు హత్యకేసులకు సంబంధించిన 7 గురు కమ్యూనిస్టులకు నల్గొండ ప్రత్యేక న్యాయస్థానం విధించిన మరణ శిక్షలను హైదరాబాదు హైకోర్టువారు నేడు ధ్రువపరిచారు. ముద్దాయిల అప్పీళ్ళకు అడ్వొకేటు జనరల్ డి. వి. శ్రీఖండే వ్యతిరేకంగా వాదించారు. ముద్దాయిలు అల్లూరి యెలమడు, గులాం దస్తగీర్, వడ్డె పాపయ్య, అడపు అమర్లయ్య, నారాయణరెడ్డి, మిరియాల లింగయ్య, దాసరెడ్డి అనువారు.

# ఢిల్లీలో జల విద్యుత్ ఇంజనీరింగ్ ప్రదర్శనం

## 45 రాజ్యాలకు భారత ప్రభుత్వాహ్వానం

న్యూఢిల్లీ, డిశంబరు 14: భారత ప్రభుత్వం, అంతర్జాతీయ అవధిని, ఒక ఇంజినీరింగ్ ప్రదర్శనాన్ని జనవరి మాసంలో యేర్పాటుచేయబోతున్నది. దీనిలోపాల్గొనవలసిందిగా కోరుతూ 45 దేశాలకు ఆహ్వానాలు వెళ్ళినై.

జలాధారము నిర్మాణములు, విద్యుదుత్పత్తి ఈ రెంటికి సంబంధించిన అనుబంధ పరిశోధనలు మొదలైనవాటిని యీ ప్రదర్శనంలో చూపుతారు. ఈప్రదర్శనం అంతర్జాతీయ ఇంజనీర్ల సమావేశాలూ మూడూ జరిగే సమయానికి సరిగా యేర్పాటు చేయబడ్డై. ఈమూడూ: (1) అంతర్జాతీయ వారధి నిర్మాణ సమావేశం (2) అంతర్జాతీయ విద్యుచ్ఛక్తి సమావేశం, (3) అంతర్జాతీయ (హైడ్రాలిక్) జలశక్తి యంత్రపరిశోధనా సమావేశం.

ఈ మూడు సమావేశాలలోనూ 300 లేక 400 వందల దాకా అంతర్జాతీయంగా వున్న ప్రముఖఇంజనీర్లంతాపాల్గొంటారు.

నదులను అదుపు చేయటానికి పనికివచ్చే యంత్రాల నమూనాలూ, వంతెనలు, వ్యవసాయిక యంత్రాలూ, నౌకాయంత్రాలూ, విద్యుదుత్పత్తియంత్రాలు వగైరా నమూనాలన్నీ యీ ప్రదర్శనంలో చూపుతారు. ఆయానదీనద బంధనాల నమూనాలన్నీ ప్రదర్శిస్తారు.

ఈ ప్రదర్శనానికి కావలసిన యావత్తు సహకారమును అందజేయవలసిందిగా కేంద్రప్రభుత్వంరాష్ట్ర సంస్థానాలన్నిటినీ కోరుతున్నది.

ఈ ప్రదర్శనానికి, కెనడా, సింహళం, యీజిప్టు, ఫ్రాన్సు, బ్రిటన్, హంగరీ, పాకిస్థాన్, పోలండ్, దక్షిణాఫ్రికా, అమెరికా, రష్యా మొదలైన దేశాలన్నిటికీ ఆహ్వానాలు వెళ్ళినై.

# 'ఆంధ్రులు ఉత్సాహంతో పనిచేస్తే అచిరకాలంలోనే మన రాష్ట్రం స్వయంపోషకం కాగలదు'

## గోదావరి వంతెనకు శంకుస్థాపన చేస్తూ కళా వెంకట్రావుగారి ఉద్బోధ

కాకినాడ, డిసెంబరు 15: "కాంగ్రెసుసంస్థలోను, దానికార్య క్రమప్రణాళికలోను మీరు విశ్వాసముంచండి, కాంగ్రెసు నాయకులలో నమ్మకముంచి వారిని సంకోచరహితులై అనుసరించండి. ఆంధ్రప్రజాశ్రేయస్సుకు ఈ నాడిక్కడ శంకుస్థాపన జరుగుతున్నది. ఆంధ్ర ప్రజలు సర్వత్యాగాలకు సంసిద్ధులై ఉత్సాహంతోను, బాధ్యతతోను సహకరించి పనిచేస్తే ఆంధ్రదేశం అచిరకాలంలో స్వయంపోషకరాష్ట్రం కాగలదు." అని కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి శ్రీకళా వెంకట్రావుగారు నిన్న ఆలమూరువద్ద గోదావరి వంతెనకు శంకుస్థాపనచేస్తూ ఉద్ఘాటించారు.

నిన్న మధ్యాహ్నం జరిగిన శంకుస్థాపన మహోత్సవం ఒక రమణీయదృశ్యమై శోభించింది. వేదమంత్రాలు గంభీరంగా ప్రతిధ్వనించాయి. ఈ ఉత్సవం కోసం ప్రత్యేకంగా నిర్మితమైన పందిరి జాతీయ పతాకాలతోను, తోరణాలతోను అందంగా అలంకృతమైంది. దాదాపు 10 వేల జనం హాజరయ్యారు. బాలికల 'వందేమాతరం' గానంతో సభ ఆరంభమైంది. పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి ఎమ్. భక్తవత్సలం గారు అధ్యక్షత వహించారు.

హాజరైనవారిలో శాసన సభ్యులైన పళ్లంరాజు, వెంకటనారాయణ, లింగరాజు, వెంకటరత్నం, పురుషోత్తం (ఎమ్. ఎల్. సి.) గార్లు, జిల్లాబోర్డు అధ్యక్షుడు మారిన నరసన్నగారు, పెన్మెట్స సత్యనారాయణ, నరసింహదేవర సత్యనారాయణ, నాగేశ్వర అయ్యర్, ఎమ్. సి. కోల్వి, బ్రజనారాయణ (కేంద్రప్రభుత్వ ఇంజనీర్లు) బి. ఎన్. షెనాయ్, ఎన్. దురానీ, బి. రామమోహనరావు, ఎన్. శేషగిరిరావు, కె వి. చౌదరీ, ఎమ్. సేతు మాధవరావు, ఎమ్. భైరవమూర్తి, సి. శేషావతారం (ఇంజనీర్లు) వి. పదారంగణి (కాకినాడ ఇంజనీరింగ్ కాలేజి ప్రిన్సిపాలు) ప్రొ॥ సీతాపతి, జిల్లాపోలీసు సూపరింటెండెంటు వెంకటనాయర్, మొదలైన ప్రముఖులున్నారు.

కళా వెంకట్రావుగారు మాట్లాడుతూ, తూర్పు పశ్చిమ గోదావరిజిల్లాలను రోడ్డుద్వారా కలపవలెనని ఏళ్లతరబడి వేధిస్తున్న తీరని కోరిక నేటితో తీరబోతున్నందుకు తాను ఎంతో సంతోషపడుతున్నానన్నారు.

వచ్చిన సభా సదులకు స్వాగత మిస్తూ రాష్ట్ర రహదార్ల ప్రధాన ఇంజనీరు ఎమ్. ఎస్. తిరుమల అయ్యంగార్, ఈ రాష్ట్ర రహదార్ల చరిత్రలో ఇది స్వర్ణాక్షరములతో లిఖింపదగిన దినమన్నారు. గౌతమీ గోదావరిమీద, వసిష్ఠ గోదావరిమీద వంతెనలువేసి తూర్పు గోదావరిలోని ఆలమూరును పశ్చిమ గోదావరిలోని ఖండవల్లితో కలపవలెనని సంకల్పించామని, నిర్మాణమునకయ్యే వ్యయంలో రూ. 105 కోట్లకు పైబడిన వ్యయమును చెరిసగం పంచుకోవాలని కేంద్రప్రభుత్వం చేసిన సూచనను రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించిందనీ, వంతెన 1955 కు పూర్తిచేయాలని తమ సంకల్పమనీ తెలిపారు. (వీరిఉపన్యాసం, భక్తవత్సలంగారి ఉపన్యాసం నిన్నటి పత్రికలో పూర్తిగా ప్రకటింపబడినవి)

మంత్రి భక్తవత్సలంగారికి ఆలమూరు పంచాయతీ బోర్డు తరఫున ఉపాధ్యక్షుడు వి. లక్ష్మీనారాయణగారు వినతి పత్రం అర్పిస్తూ ఆలమూరుకు విద్యుచ్ఛక్తి ఏర్పాటుచేయ గోరారు. గ్రామ బ్యాంకి తరఫున ఎస్. జనార్దనశాస్త్రిగారు, మండపేట పంచాయతీ బోర్డు తరఫున అధ్యక్షుడు ఎమ్. కొండలరావుగారుకూడా వినతిపత్రము లర్పించారు.

చింతలూరు వెంకటశాస్త్రి, చక్రవర్తుల కామేశ్వరశాస్త్రిగార్లు, ఇతర కవి ప్రముఖులు ఆశీర్వచన పద్యాలు చదివారు.

కాకినాడ, రహదార్ల సూపరింటెండింగ్ ఇంజనీర్ ఎన్. దురానీగారు అభినందనములు సమర్పించటంతో సభ జయప్రదంగా సమాప్తమైంది. (స్వ. వి.)

# అమెరికా ఆయుధాల సప్లయి

## షరతులపట్ల బ్రిటన్ అధిక్షేపణ

### డీన్ ఎచిసన్‌కు అందజేశారు

వాషింగ్టన్, డిసెంబరు 14: మిత్ర రాజ్యాలకు ఆయుధాలు సప్లయిచేసే విషయంలో అమెరికా ప్రభుత్వం విధిస్తున్న షరతులపట్ల బ్రిటిష్ ప్రభుత్వం నేడు తన ఆక్షేపణను తెలియజేసింది. వాషింగ్టనులోని బ్రిటిష్ రాయబారి సర్ ఆలివర్ ఫ్రాంక్స్ద్వారా ఈ ఆక్షేపణపత్రం అమెరికా విదేశాంగశాఖామంత్రి డీన్ఎచిసన్‌కు అందజేయబడింది.

అమెరికాకు, ఉత్తర అట్లాంటిక్ రాజ్యాలకు మధ్య ఆయుధాల సప్లయి విషయంలో తయారైన ఒప్పందంపట్ల బ్రిటిష్ ప్రభుత్వం ఇందులో తన ఆక్షేపణను తెలిపిందని అధికారవర్గాల ద్వారా తెలుస్తున్నది. ప్రస్తుతం నిర్ణయించిన షరతులపై బ్రిటను అమెరికన్ ఆయుధాలను స్వీకరించుటానికి నిరాకరించవచ్చునని కూడా తెలుస్తున్నది.

## "డార్జిలింగ్ రాష్ట్రం"

### అనర్థదాయకమని సర్దార్ పటేల్ ప్రకటన

న్యూఢిల్లీ, డిశంబరు 15: పశ్చిమబెంగాలు నందలి డార్జిలింగ్ ప్రాంతమును ఒక ప్రత్యేక కొండప్రాంత రాష్ట్రముగా నిర్మించుటకు ప్రారంభమైన ఉద్యమము కృత్రిమమైనదని, హానికరమైనదని, భారత ప్రభుత్వమువారు తలచుచున్నట్లు ఉపప్రధాని సర్దార్ పటేలుగారు పార్లమెంటులో నేడు పండిత ఠాకూర్‌దాస్ భార్గవా ప్రశ్నకు వ్రాతపూర్వకముగా సమాధానమిచ్చుచు చెప్పిరి.

ఈ సందర్భమున ఒక విజ్ఞప్తి ప్రభుత్వమువారికందెనా? ఈ సమస్యపై ప్రభుత్వమువారి విధానమేమి? అని పండిత భార్గవాగారు ప్రశ్నించిరి.

సర్దార్ పటేలు: "ప్రభుత్వము వారికి విజ్ఞప్తులేమియు చేరలేదు. కాని యిట్టి కార్యకలాపముల విషయమై పత్రికలలో నేను వార్తలు చూచితిని. ఈ వుద్యమము భారతదేశ క్షేమమునకు భంగకరమని, కృత్రిమమైనదని, హానికరమైనదని ఇండియా ప్రభుత్వమువారు భావించుచున్నారు. ఇట్టి రాష్ట్ర నిర్మాణాందోళనకు యిట్టి అవకాశమూ యివ్వకుండుటకు భారత ప్రభుత్వమువారు కృతనిశ్చయులై యున్నారు. అనర్థదాయకములగు యిట్టి వుద్యమములవల్ల భారతదేశ ఐక్యమునకు భంగము కలుగును. ప్రభుత్వమువారు భారత దేశఐక్యమునకు యెట్టి భంగము కలుగనివ్వరు."

## కమ్యూనిస్టు చైనా పరిగణన

### బ్రిటిష్‌ప్రభుత్వ నిర్ణయం నేడు జరుగవచ్చు

లండన్, డిసెంబరు 15: కమ్యూనిస్టు చైనా ప్రభుత్వాన్ని గుర్తిస్తూ యే తేదీన తాము ప్రకటన చేయవలసిందీ, రేపు బ్రిటిష్ మంత్రివర్గం నిశ్చయించుకొంటుందని, విశ్వసనీయ వర్గాలద్వారా యీ రాత్రి తెలియవచ్చింది.

కమ్యూనిస్టుచైనాను గుర్తించవలెనని, క్రితం అక్టోబర్‌లోనే బ్రిటిష్‌ప్రభుత్వం నిర్ణయించుకొన్నది. అయితే, కమ్యూనిస్టు చైనాను గుర్తించడం, సింహళంలో విదేశాంగ మంత్రులసభకు పూర్వమా తరువాత అన్నది యిప్పటివరకూ తేలకుండా ఉన్నది.

ఈవేళ కామన్సుసభలో ఒక ఎమ్పీ, బ్రిటిష్ రాయబార కార్యాలయోద్యోగులు, తదితర బ్రిటిష్‌ప్రభుత్వ ప్రతినిధులను కమ్యూనిస్టుప్రభుత్వం మర్యాదగా చూచేటంతవరకూ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించబోమని, ప్రభుత్వం హామీయిస్తుందా అని అడుగగా, ఈలాంటి హామీ యేమీ యివ్వలేమని బ్రిటిష్ విదేశాంగ శాఖా సహాయ కార్యదర్శి క్రిస్టఫర్ మెహ్యూ అన్నాడు.

## చంద్రనగర్‌లో బహిరంగ సభల నిషేధం

చంద్రనగర్, డిసెంబరు 14: పురపాలక సమితి అనుమతి పొందకుండా, నగరంలో బహిరంగసభలుగాని, ఊరేగింపులుగాని, ప్రదర్శనలుగాని జరుప గూడదని, చంద్రనగర్ పురపాలకాధ్యక్షుడు యివ్వాళ తాత్కాలికంగా ఒక ఆర్డినెన్సును జారీ చేశారు. ఈ ఆర్డినెన్సు ప్రకారం కరపత్రాలు పంచగూడదని, గోడలపై కాగితాలు అంటించడంగాని చేయగూడదు.

## ప్రకటన

### తూర్పుగోదావరి జిల్లా బోర్డు

తూర్పు గోదావరి జిల్లా బోర్డు యాజమాన్యము క్రింద నున్న పంటిల లోను ఏటి రేవులవద్దను 1950-51 సంవత్సరములో రుసుములువసూలు చేసుకొను హక్కు 8-1-1950 తేది నుండి బహిరంగముగా వేలము వేయబడును. వేలము తేదీలు, పాట షరతులు వగైరాలు, గల ప్రచురణ ప్రతులు తూర్పు గోదావరి జిల్లా బోర్డు ఆఫీసులో గాని హైవేసు అసిస్టెంటు ఇంజనీయర్ల ఆఫీసులలో గాని లైసెన్సు యినస్పెక్టర్ల ఆఫీసులలో గాని దొరకును.

కాకినాడ 7-12-49 } ఎం. నరసన్న, ప్రెసిడెంటు.



# ఇండియా - పాకిస్తాను వర్తకం ఒడంబడిక రద్దు కావచ్చు

కలకత్తా, డిసెంబరు 15 : పాకిస్తానులో చేరిన తూర్పు బెంగాలు నుండి కలకత్తాకు వచ్చిన వార్తలనుబట్టి ఇండియాపాకిస్తానుల మధ్యనున్న వర్తకపు ఒడంబడిక, రద్దుచేసి కొనవచ్చునని భావించుచున్నట్లుగా తెలిసినది. రెండుమాసముల క్రిందట ఇండియా ప్రభుత్వపు రూపాయియొక్క మారకపురేటు తగ్గింపబడెను. కాని పాకిస్తానుయొక్క రూపాయిమారకపు రేటు తగ్గింపబడలేదు. ఇందుమూలంగా ఉభయ రాజ్యాలమధ్య వ్యాపారం స్తంభించినది. ఈ కారణంచేత ఈ రెండురాజ్యాలమధ్య వర్తకవ్యాపారసంబంధములు తెగిపోవుటకు ఆవకాశమేర్పడుచున్నది.

తూర్పు బెంగాలునుండి ఇండియాకు రవాణా చేయబడుటకు 5 లక్షల బేళ్ల జనపనార సిద్ధముగా నుండగా ఆ సరకు ఇండియాకు రవాణా చేయబడకూడదని పాకిస్తాను ప్రభుత్వము నిరోధించెను. ఆ విషయములో ఇండియా ప్రభుత్వమునకు పాకిస్తాను ప్రభుత్వమునకు మధ్య కొన్ని టెలిగ్రాములు నడచినవి. వాటి పర్యవసానంగా ఉభయరాజ్యాలమధ్య వ్రాసికొనబడిన వ్యాపార ఒడంబడికను పాకిస్తాను ప్రభుత్వం రద్దుచేసికొనవచ్చునని తెలియుచున్నది. సదరు జనపనార వాదనలలో ఎక్కించబడెను. పాకిస్తాను ప్రభుత్వము తన రూపాయి మారకంరేటు యధాతథంగానే ఉంచుటకై నిర్ణయం జేయకపూర్వమే ఇండియాలోని వర్తకులు అసరుకునకు ఆర్డరు ఇచ్చియుండిరి. కనుక ఆ సరకును రవాణా చేయవలెననియు నిరోధించరాదనియుఇండియా ప్రభుత్వము తెలియజేసెను. సరకును ముందుగా సప్లయి చేసి అటుపిమ్మట సదరు సరకు సప్లయి కంట్రాక్టు విషయమైన తగాదాను మధ్యవర్తులద్వారా పరిష్కరించుకోవచ్చునని ఇండియా ప్రభుత్వం తెలియజేసెను.

ఇండియా పాకిస్తాను ఒడంబడిక ప్రకారంగా ఇండియానుంచి 23 లక్షల టన్నుల నేల బొగ్గున్ను 4 లక్షలబేళ్ల వస్త్రములును నూలును, 50 వేల టన్నుల గోసునారసేత సరకులును, 80 వేల టన్నుల ఇనుము ఉక్కున్ను సప్లయి కావలసియున్నది. ఇందుకు బదులుగా పాకిస్తాను నుండి, 50 లక్షల బేళ్ల గోసునారయున్ను $6\frac{1}{2}$ లక్షల బేళ్ల ప్రత్తియున్ను 1,75,000 టన్నుల ఆహారధాన్యములును ఇండియాకు సప్లయి కావలెను.

రూపాయిమారకంరేటు విషయములో ఉభయప్రభుత్వాలకు ఏర్పడిన వ్యత్యాసమువల్ల ఇండియాతో వ్యాపార సంబంధమును పాకిస్తాను క్రమేణ తెంచుకొనే ధోరణిలోనికి దిగినదని ఇండియా ఖజానా మంత్రి జాన్‌మత్తయిగారు చెప్పియున్నారు.

గోగునారబేళ్ల రవాణాను పాకిస్తాను ప్రభుత్వం ఆటంకపరచి నిరోధించుటవల్ల వ్యాపార ఒడంబడిక రద్దుకావచ్చును.

## అజంతా హోటల్

### నూతన వసతి గృహ ప్రారంభోత్సవము

మదరాసు, డిసెంబరు 15: రాయపేట హైరోడ్డులో స్థానిక ఆంధ్రవర్తక ప్రముఖులైన శ్రీ పురం ప్రకాశరావుగారు నిర్మించిన "అజంతా హోటల్" అనే పేరుగల నూతన విశ్రాంతి గృహమునకు నేటిఉదయం మద్రాసు మేయరు డా॥ పి. వి. చెరియన్‌గారు ప్రారంభోత్సవం జరిపారు.

నగరంలోని ఆంధ్ర, ఆంధ్రేతర వాణిజ్య, న్యాయవాద, ప్రభుత్వోద్యోగ, ప్రముఖులు, పత్రికాధిపతులు, ప్రతినిధులు ఫలవుపు విచ్చేశారు.

నగర ప్రధాన ప్రాంతాలలో ఒకటైన రాయపేటలో నెలకొల్పబడ్డ ఈ క్రొత్త వసతిగృహం, నగరంలో, ముఖ్యంగా ఆ ప్రాంతములో ఇట్టి వసతిగృహాలు లేని లోటుకు చాలవరకు తీర్చగలదు. ఆధునిక సదుపాయాలను కూడా కల్పచేసి విశ్రాంతికై వచ్చువారికి పరిపూర్ణమైన వసతి కల్గించవలెనని శ్రీ ప్రకాశరావుగారి ఆశయం.

ప్రారంభోత్సవానంతరం అతిథులకు అల్పాహారవిందు చేయబడినది.

## ఆంధ్ర తుపానుబాధితుల సహాయ్యనిధి

చెన్నపట్నం, డిశంబరు 15 : దక్షిణదేశపు విఖ్యాత గాయకురాలు మిస్ టి. సూర్యకుమారి ఆంధ్ర తుపానుబాధితుల నిధి సహాయార్థం పశ్చిమ బెంగాలు ఒరిస్సా రాష్ట్రములందు యీ దిగువ స్థలములలో సంగీత ప్రదర్శనములిస్తూ పర్యటించుచు.

డిశంబరు 18 ఉదయం కలకత్తా, 20 సాయంత్రం జంషెడ్‌పూర్, 24 సాయంత్రం ఖరగ్‌పూర్, 25 సాయంత్రం కలకత్తా, 27 సాయంత్రం కటకం 28 సాయంత్రం కటకం.

# హిందూమహాసభ రాజకీయాలు

## కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి విమర్శ

అనంతపురం, డిసెంబరు 14: రాబోయే ఎన్నికలలో హిందూమహాసభ పోటీచేయబోతున్నదనే వార్తపై మీ అభిప్రాయమేమిటని ఒక విలేఖరి అడుగగా, కళా వెంకట్రావుగారు ఇలా అన్నారు.

"ఎటు గాలివీస్తే అటు తిరిగే హిందూ మహాసభ నాయకులు మళ్లీ రాజకీయాలలో దిగితే దిగవచ్చునుగాని, ఎవరికై తే మేము సౌఖ్యం చేకూరుస్తామని వారంటున్నారో, ఆ సామాన్య ప్రజలకు వీరి సత్తా ఏమిటో, స్వాతంత్ర్య సమరంలో వీరేమాత్రం పాల్గొన్నారో బాగా తెలుసు. మత ప్రధానమైన రాజ్యాన్ని మరు తిరిగి స్థాపించదలచుకుంటున్నారు గాని అది నేటి భారత భూమిలో వర్ధిల్లదు. కమ్యూనిజం నుండి, బ్రిటిషువారి వారసులనుండి దేశాన్ని రక్షించటమే తమ ప్రధాన కర్తవ్యమని తేజ్ నారాయణ్‌గారంటున్నారు కాని, మహాసభ ప్రాతినిధ్యం వహించే ధనిక ప్రజలు కమ్యూనిజమును నెదుర్కొనలేరు, దాని యెదుట నిలబడలేరుకూడా.

కాంగ్రెసు గుణగణాలు సామాన్య ప్రజకు తెలుసు. సామాన్యప్రజ పరిస్థితులు కాంగ్రెసుకు తెలుసు. కనుక హిందూ మహాసభ స్నేహితులు సామాన్య ప్రజకు, కాంగ్రెసుకు మధ్య రావటం మంచిది కాదని గ్రహించటం మంచిది."

# రాజోలు తాలూకా కాంగ్రెస్ సమావేశం

## తుపాను బాధితులందరికి అప్పులివ్వాల్సిందని విజ్ఞప్తి

రాజోలు, డిశంబరు 13: రాజోలు తాలూకా కాంగ్రెసు సంఘసమావేశం నన్నా నారాయణరావుగారి అధ్యక్షతను నిన్న జరిగినప్పుడు తుపానుబాధితులకు గాను ప్రభుత్వమువారిచే ఇవ్వబడు ఋణములకు ప్రస్తుతముగల నిబంధనలు, జనసామాన్యానికి ఉపయోగించేవిగా లేవుగాన, ఆస్తి వున్నను లేకపోయినను, ఇల్లుగల ప్రతి తుపానుబాధితకుటుంబానికి అప్పు తగిన రీతిని ముట్టేటట్టుగా సౌకర్యం వెంటనే కలుగజేయవలసిందని ప్రభుత్వంవారిని కోరుచు ఒక తీర్మానం చేశారు.

రాజకీయబాధితులకు భూములు మంజూరు చేయాలని ప్రభుత్వప్రకటన వెలువడి సుమారు మూడేండ్లుజరిగినప్పటికీ యింత వరకు యీ తాలూకాలో అర్హులైన రాజకీయ బాధితులకు ఎవరికి మంజూరు చేసియుండలేదు. అర్హులయిన రాజకీయబాధితుల సరియైనజాబితా ఇదివరలోనే కలెక్టరుగారికి పంపించబడింది. అంతర్వేదిలోని బంజరుభూమిని సాగుచేయుటకు కొందరు ప్రత్యేకంగా, ఇతరచోట్లకొందరు దరఖాస్తు చేసియున్నారు గాన, ప్రభుత్వం వారు వెంటనే ఆ దరఖాస్తులను యథాతథంగా మంజూరుచేసి భూములుఇప్పించగలందులకున్ను, హరిజనులకు, ఇతరబీద రైతులకు (స్వంత భూములులేనివారు) అంతర్వేదిబంజరులోను, యితరచోట్లను తగినరీతిని మంజూరుచేసి, ఆహారధాన్యాల అధికఉత్పత్తికి తోడ్పడాలని ప్రభుత్వం వారినికోరుతూ తీర్మానించడమైనది.

# సభలుసమావేశములు

దక్షిణ విశాఖజిల్లా రైతు కాంగ్రెస్, యువజన కాంగ్రెస్, జిల్లా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కార్యవర్గముల సంయుక్త సమావేశం విశాఖపట్నంలో యీ నెల 25 న జరుగునని ఫిసెట్టి అప్పారావుగారు వ్రాస్తున్నారు.

### ఆంధ్రమహాసభ స్థాయిసంఘ సమావేశం

విజయవాడ, డిశంబరు 14: ఆంధ్ర మహాసభ స్థాయిసంఘ సమావేశము యీ నెల 25 వ తేదీ సాయంకాలం 3 గంటలకు నూజివీడులో గయ్యూరి. రాజావారి హైస్కూలు భవనంలో జరుగును. అని మహాసభ ప్రధాన కార్యదర్శి జి. వి. పున్నయ్యశాస్త్రిగారు తెలియజేస్తున్నారు.

### గుంటూరుజిల్లా కాంగ్రెస్ సేవకుల సమావేశం

గుంటూరు, డిశంబరు 14: ఈ జిల్లా కాంగ్రెస్ సేవకుల సమావేశం యీ నెల 21 వ తేదీ సాయంకాలం 4 గంటలకు గుంటూరులో జరుగును. జిల్లాలోని కాంగ్రెస్ సేవకులందరు సమావేశమునందు పాల్గొనవలసిందని కోరుతూ బాచిన సుబ్బారావు, పుల్లెల రత్తయ్య, కోసరాజు అమ్మయ్య, దరువూరి వీరయ్యగార్లు ప్రకటిస్తున్నారు.

### చిత్తూరు మ్యునిసిపాలిటీ

చిత్తూరు మ్యునిసిపాలిటీని 1950 జనవరి 1 నుండి 2 వ తరగతి మ్యునిసిపాలిటీ క్రింద మార్చునా ప్రభుత్వం వుత్తర్వు చేసెను.

# "లక్షలటన్నుల చక్కెర అదనపు ఉత్పత్తి"

## మిల్లు యజమానుల నిర్ణయం

ఢిల్లీ, డిశంబరు 13: దేశమంతటినుండి చక్కెర ఫ్యాక్టరీల ఆసాములు సుమారు ఒకవంద ఫ్యాక్టరీలతరఫు ప్రతినిధులుసేను ఢిల్లీలో భారతదేశ చక్కెర మిల్లుదారల సంఘ వార్షికసభ సందర్భమున సమావేశమైరి. చక్కెరఉత్పత్తిని గరిష్ఠ పరిమితికి హెచ్చించవలెనని ఇండియా ప్రభుత్వ ఉపప్రధాని సర్దారు పటేలుగారు కోరిరి. పటేలుగారి కోరికప్రకారముగా హెచ్చుగా చక్కెరను ఉత్పత్తిచేయుటకు యీ సభకువచ్చిన చక్కెరమిల్లుల ఆసాములు అంగీకరించిరి. ఇప్పుడు జెఱుకుగడను గానుగ ఆడించే ఋతువు. ఈ ఋతువులో 11 లక్షల టన్నుల పరిమితి వరకైనను చక్కెరఉత్పత్తి చేయవలెనని యీ మిల్లు ఆసాములు నిర్ణయించిరి. అధికమీని హెచ్చుగా చక్కెరఉత్పత్తి చేయుటవల్ల చక్కెరధర తగ్గగలదు.

ఈ అధిక పరిమితి చక్కెరను ఉత్పత్తి చేయుటకై చక్కెర మిల్లు ఆసాముల సంఘములోనివారు తమకు కొన్ని ప్రత్యేక సదుపాయములను కలుగచేయవలెనని గవర్నమెంటును కోరిరి. ఈ సంఘమునకు అధ్యక్షులుగా నుండి యిప్పుడు విరమించుచున్న శాంతిప్రసాదు జెయినుగారు 65 నిమిషములసేపు ఉపన్యసించిరి. ఈసంఘమువారు తమకు కొన్ని సౌకర్యములను కలుగజేయవలెనని కోరుచు ప్రభుత్వము వారితో జరిపిన రాయబారముల గూర్చియు చక్కెర ధరను స్థిరంగా నిర్ణయించు విషయమునుగూర్చియు, యీ చక్కెర పరిశ్రమకు రక్షణనొసంగు విషయమును గూర్చియు విపులముగా వారి యుపన్యాసములో వివరించి చెప్పిరి.

ఇతరదేశాలలో ఉత్పత్తి చేయబడుచున్న చక్కెర మనదేశముకంటె తక్కువ వెలకు తయారు అగుచున్నది. కాని ఆదేశములలో చెఱుకుగడ మిల్లులకు సమృద్ధిగా లభించుచున్నది. ఆ కారణముచేతనే ఆదేశాలలోని చక్కెర చౌకగా తయారగుచున్నది. కాని, మనదేశపు మిల్లులకంటె అవి యెక్కువ సమర్థంగా పనిచేయుటవల్ల కాదు. మనదేశపు మిల్లుల ఆసాములకంటె తక్కువ లాభమునకు చక్కెరను అమ్ముటవల్ల కాదు.

మనదేశములో వెలసిన యీ చక్కెరపరిశ్రమ చాలా కొద్దికాలము క్రిందటనే వెలసినది. ఇది యింకను బాల్యావస్థలోనే ఉండుటవల్ల ఉత్తరోత్తర చాలా వృద్ధిలోనికి రాదగియున్నది. మన చక్కెరను విదేశాలకుకూడా రవాణాచేయ వీలున్నది. కనుక, దూరదృష్టితో వ్యవహరించి యీ పరిశ్రమకు తగిన ప్రోత్సాహము నొసంగవలెను.

ఇండియాప్రభుత్వ ఆహారశాఖామంత్రి యగు జయరామదాసు దౌలత్‌రామ్‌గారు యీ సభను ఉపక్రమించుచు తమ ఉపన్యాసములో యీ క్రింది విషయములు చెప్పిరి. చక్కెర ఉత్పత్తి విషయమై ఇండియా పార్లమెంటు చర్చింపనున్నది. కనుక ఆ చర్చలో ప్రస్తావింపబడు విషయములను నేనిప్పు దూహించి చెప్పడం న్యాయంకాదు.

చక్కెర ధరను గవర్నమెంటు నిర్ణయించుట న్యాయం కాదని మీరనుచున్నారు. కాని చక్కెర ఫ్యాక్టరీల ఆసాములు తమ ధరను పెంచుచున్నప్పుడు గవర్నమెంటు దానిని తగ్గించవలసివచ్చింది చెఱుపంట పండించెడి భూమి స్తీర్ణమును తగ్గించుటకు గవర్నమెంటు సంకల్పించలేదు.

## మద్రాసు వైమానికక్లబ్బు విమాన ప్రమాదం

ట్రిచ్యాలన్, డిశంబరు 14: మదరాసు వైమానికక్లబ్బుకు చెందిన నొక శిక్షణ విమానం ప్రమాదవశమున క్యాలన్ విమానాశ్రయంలో యీవాళ మధ్యాహ్నం కూలినది. అందులో నుండిన వైమానికుడు పి. కే. మాథ్యూ అనువతనికి గాయాలు తగిలి ఆసుపత్రిలో చికిత్సపొందుతూ సగిననూ చనిపోయెను. విమానములో మరెవ్వరూ యుండలేదు. (పి. టి. ఐ.)

## డిటెన్యూల విడుదల

మదరాసు, డిశంబర్ 15: కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమములోను, రహస్యచర్యలలోను పాల్గొనమని పూచీఇచ్చిన రాపర్తి సూర్యనారాయణ, బత్తిన కామరాజు అనే విశాఖపట్నం డిటెన్యూలను విడుదల చేయవలెనని ప్రభుత్వము వుత్తర్వు చేసెను.

## విశాఖపట్నానికి జగజీవనరాం ఆగమనం

### డిసెంబరు 30 న

విశాఖపట్నం, డిసెంబరు 14: భారత ప్రభుత్వ కార్మికశాఖామంత్రి జగజీవనరాంగారు డిశంబరు నెల 30 వ తేదీన విశాఖపట్టణానికి వస్తున్నారు. అప్పుడు వారు, విజయనగరంకూడా వెళ్లి అక్కడ గల విశాఖజిల్లాలోకల్లా ప్రధాన తోళ్లపరిశ్రమ కేంద్రాన్ని తనిఖీ చేస్తారని తెలుస్తున్నది.

# హిందూస్తానీ-ప్రభుత్వ వైఖరి

## పార్లమెంటులో చర్చ

న్యూఢిల్లీ, డిసెంబర్ 15: "హింసీఅభివృద్ధికోసం పాటుపడుతూనే, ప్రస్తుత స్వరూపంలో హిందూస్తానీని ప్రతిపాదించేవిషయమై ప్రభుత్వం ఆలోచిస్తుంది" అని విద్యాశాఖమంత్రి మౌలానా అజాద్ నేడు పార్లమెంటులో ఒక ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించగా సేట్ గోవిందదాస్ నిరసన వెల్లడించాడు. హిందీయే రాష్ట్రభాషగా ఉండాలని రాజ్యాంగ పరిషత్తు చేసిన నిర్ణయాన్ని తోసిరాజనటానికి ప్రభుత్వానికి అధికారం ఏమున్నదని ఆయన ప్రశ్నించగా సభ్యులంతా 'ఆర్డర్, ఆర్డర్' అని కేకలు వేశారు.

### వయోజన విద్య

దేశంలోని గ్రామీణ ప్రజల్లో 1947 సం॥లో 10 వేలకు 22మంది,1948లో వయోజనులు వయోజన విద్యాప్రచార ఫలితాన్ని పొందారని విద్యామంత్రి అజాద్ గారు మరొక ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించారు. రాష్ట్రప్రభుత్వాలూ, కేంద్రప్రభుత్వమూ, కొన్ని సందర్భాలలో మునిసిపాలిటీలూ కలిసి వయోజన విద్యా ప్రచార వ్యయాన్ని భరిస్తున్నవని ఆయన వెల్లడించాడు.

### ప్రభుత్వ వ్యయం తగ్గింపు

ప్రభుత్వ వ్యయంలో తాత్కాలికంగా ప్రతిపాదించబడిన తగ్గింపు అక్టోబర్ నుంచీ అమల్లోకి వచ్చిందని ఆర్థికమంత్రి వెల్లడించారు.

పెద్ద ఎత్తున ఉద్యోగులకు ఉద్వాసన చెప్పకుండా నివారించటానికి ఈ పొదుపు విధానం ప్రవేశ పెట్టబడినదని ఆయన అన్నారు.

"పొదుపు ఉద్యమ ఫలితంగా 10 వేల మంది ఉద్యోగులకు తొలగింపు నోటీసు లివ్వబడిన మాట నిజమేనా"? అని ఫ్రాంక్ ఆంథోనీ గారు ప్రశ్నించగా తనకా విషయం తెలియదని మంత్రి గారు జవాబిచ్చారు.

### ప్రభుత్వ ఋణాలు

ఈ సం॥ క్రొత్త ప్రభుత్వ ఋణాలేవీ ప్రారంభించ లేదనీ, 1949-సం॥పు 52 3% ఋణాన్ని మార్చటానికి ఉన్న అవకాశాన్ని పట్టి అది 1955 సం॥ పు $2\frac{3}{4}$ % ఋణంగా (25 కోట్ల 44 లక్షలు, మార్చబడిందనీ ఆర్థిక మంత్రి వెల్లడించాడు.

### అమెరికాలో వ్యాపారం

"గత $2\frac{1}{2}$ సం॥ లు సాగిన వ్యాపారపు ఫలితంగా ఇండియా అమెరికాకు 1947 లో 7906 లక్షలరూపాయలూ, 1948 లో 6663 లక్షలూ, 1949 జూన్ వరకూ 3744 లక్షలూ ఇవ్వవలసింది. అని ఆయన మరొక ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించాడు.

### క్వైనా వాడకం

1948—'49 సం॥లో ఇండియా 5 లక్షల పౌన్ల క్వైనా మందులు వాడిందనీ, అందులో లక్ష పౌన్లు మాత్రమే దేశంలో తయారయిందనీ, మిగిలిన దంతా పౌను 1 కి 41 మొదలు 62½ రూపాయల వరకూ పెట్టి విదేశాలనుంచి తెప్పించ వలసి వచ్చినదనీ, ఆరోగ్య మంత్రి అమృత కౌర్ వెల్లడించింది. ఇండియాలో తయారైన క్వైనా పౌను 1 కి 29 రూపాయలకు గిట్టిందనీ ఆమె వెల్లడించింది.

### శిశు మరణాలు

"1944 సం॥లో దేశంలో జన్మించిన ప్రతి వెయ్యి మంది శిశువులకూ 169 మంది చనిపోయినారు. 1945 లో 151 మందీ, 1946 లో 186 మందీ, 1947 లో 146 మందీ, 1948 లో 131 మందీ చనిపోయినారు. ప్రసూతి, శిశు సంరక్షణ సంస్థలు పిల్లల విషయమై ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసినదన్న ప్రచారాన్ని ఎక్కువగా చేస్తున్నారు."అని ఆమె వెల్లడించింది.

### నేషనల్ కాడెట్ కోర్

నేషనల్ కాడెట్ కోర్ (సైనికోద్యోగ శిక్షణ దళం) స్థాపనకూ, నిర్వహణకూ 1948 — 49 లో 112 లక్షలు, ఖర్చయిందనీ, 1949-50 లో 145 లక్షలవుతుందని అంచనా వేయబడిందనీ రక్షణ మంత్రి సర్దార్ బల్దేవ్ సింగ్ వెల్లడించాడు.

## టెలిఫోను రేట్ల మార్పు

చెన్నపట్నం, డిశంబరు 14 : డిశం 16 వ తేదీ నుండి మదరాసు జిల్లాలో నుండే టెలిఫోను రేట్లు భారత దేశమున గల యితర నగరములలోనున్న రేట్లకు తగ్గింపబడును.

ప్రస్తుతము టెలిఫోను లైనకు అద్దె సెంట్రల్ ఎక్స్చేంజికి నాలుగు మైళ్ల లోపు నుంచే నెలకు రూ 12 అయియున్నది. ఆ రేటు రూ 10 లకు తగ్గించబడినది. ఇదివరకు ఒక పిలుపు చార్జి మొదటి 80 కాల్సు వరకు అణాన్నరయును ఆ తరువాత ప్రతి పిలుపునకు అణా కాణి యును అయియుండెను. ఇక పైని ఒక రూపాయకు 12 కాల్సు ప్రకారం లెక్కకట్టి చార్జీల పైకం చెల్లించే వారికి $12\frac{1}{2}$ % ముజరా ఇవ్వబడును. అలా కానిచో ఒక పిలుపునకు అణాన్నర ప్రకారం ఛార్జి చేయబడును. అని పోస్టు టెలిగ్రాఫ్సు డైరక్టరు జనరలు ప్రకటన తెలుపుచున్నది.

# రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 18 ఆదివారం

## మద్రాసు (ఎ)

ఉ. 7-30 ఉదయసంగీతం (రి) 8. ఆంగ్లమున వార్తలు. 8-15 సినిమా సంగీతం (రి). మ. 1 సి. పి. రాధ. ఆర్. జయలక్ష్మి. ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రా సహా 1-30 ఆంగ్లమున వార్తలు 1.40 సినిమా సంగీతం (రి). 2-15 మద్రాసు (బి) వలె. 3. వింజమూరి వరదరాజయ్యంగార్ పాట. 4. మద్రాసు (బి) వలె. 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా. 5-30 హెచ్. ఆర్. నారాయణన్ పాట. 6 ఆంగ్లమున వార్తలు. 6-15 సరస్వతీ బలరామన్. పాట. 6-45 ఎస్. హెచ్. పద్మనాభన్ పాట. 7.30 ఆర్. గురుమూర్తి పాట. 7-45 మద్రాసు (బి) వలె. 8 రాజలక్ష్మి రామదొరై పాట. 8-30 మద్రాసు (ఎ) వలె. 9. ఆంగ్లమున వార్తలు. 9-15 ఖాదీ ప్రదర్శన ప్రారంభోత్సవ కార్యక్రమ ప్రసారం 9-45 పాశ్చాత్య సంగీతం (రి).

## మద్రాసు (బి)

ఉ॥ 7-0 తెలుగున వార్తలు. 7-15 డి. కె. పట్టమ్మాళ్ రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. మ॥ 1-0 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఆటవిడుపు నిర్వహణ న్యాయపతి రాఘవరావు 3.0 మద్రాసు (ఎ) వలె. 4-0 కదంబం (రి). సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె. 6-15 సాయంసంగీతం. (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం, 'రక్తరేఖ' గీతికాకథ రికార్డులతో. రచన 'మల్లిక' 7-0 తెలుగున వార్తలు. 7-15 బుఱ్ఱకథ హేమంతం, పురాణ కాలక్షేపం. 7-45 జానపద క్రీడాకలాపములు. ప్రసంగం కల్లూరి వీరభద్రశాస్త్రి. 8-0 మద్రాసు (ఎ) వలె. 8-30 బి. కేశవమూర్తి వయొలిన్, 9-0 మద్రాసు (ఎ) వలె. 9-45 శ్రోతలుకోరిన పాటలు, రికార్డులు.

## విజయవాడ

ఉ. 7 తెలుగున వార్తలు. 7-45 అరియకుడి రామానుజయ్యంగార్, రికార్డులు. 7-30 జి. నాగేశభట్టు పాట 8 ఆంగ్లమున వార్తలు. 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా. 8-30 వినుపీక, ప్రబంధవీచిక : పారిజాతాపహరణము. పూలసజ్జ కథానిక, రచన, మల్లాది శ్రీధరుడు. రూపకము, రచన, కాంచనపల్లి కనకాంబ. మ. 1 తారాపథం. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. 4 పేరంటం. కలగంటి రికార్డు. రాజేశ్వరరావు, కవితా నీతిఛాయలు, విరహఛాయలు, ప్రసంగం. నూతన కాంతి, పార్కు లీవర్ ఆయిల్, ప్రసంగం. సా. 5-30 ప్రొద్దుటూరు ఎస్. పి. జమాలప్ప, వయొలిన్. 6 ఆంగ్లమున వార్తలు. 6 20 గీతమంజరి. కె. ఎల్. సైగల్ రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. (మద్రాసునుండి) 7-30 జి. నాగేశభట్టు 7.45 చిత్రవాణి (రి.) 8 ఎస్. పినాకపాణి, పాట. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 చిత్రవాణి (రి.) 9-30 ప్రొద్దుటూరు ఎస్. పి. జమాలప్ప వయొలిన్.

# మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 16 :

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు ధరలు 1-కి ఎడ్వర్డు బోసు సేల్సుటాక్సుతోసహా రు. 76 8-0 పెట్లా బంగారు తులం 115-4-0 మూసబంగారు 113-8-0 సీమవెండి తులం 100. కి (రెడీ 173-8-0 వెండి తులం 1-కి 1-12-6

**వేరుసెనగ:** (581 పౌ 1-కి ఎక్స్ పోర్టు గిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది రు. 163-0-0 (కోరమాండల్)
వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (వీవరేజి) రు. 329 దిలో 2% యఫ్. యఫ్. ఎ. కొంకాయనూనె (87 పౌన్లు గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వాలిటి. రు. 87-12-9, 88-12-9

ఆముదం
కాండి 500 పౌనులుగలది రు. 250 255
(ఒంగోలు) నరసరావుపేట) రు. 270 275

పంచదార

| | | |
|---|---|---|
| సర్కాటాగంజి (2అందరు) | | రు. 94-9-5 |
| హాసన్‌పూర్ | ,, | రు. 93-14-0 |
| మోతీపూర్ | ,, | రు. 94-7-10 |

## ఔషధముల ప్రమాణముల నిర్ణయము

మదరాసు, డిశంబర్ 15: చెన్నరాజధానిలో వుత్పత్తి యగు ఔషధములకు 1948 సం॥పు బ్రిటిష్ ఫార్మకోపియాలో నిర్ణయించిన ప్రమాణములను 1950 మార్చి 1 నుండి ఖచ్చితముగా అమలుజరుపవలెనని మదరాసు ప్రభుత్వము వుత్తర్వు చేసెను.



## ప్రకటన

విజయవాడ మునిసిపాలిటి

(మద్రాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల చట్టము యొక్క 78, 80 నిబంధనల ననుసరించి)

మునిసిపల్ కౌన్సిలువారి 22-11-49 తేదిగల 935 నెంబరు తీర్మానము.

15-6-49 తేది గల నెం 1261 రు ఎల్. ఏ. గవర్నమెంటు వారి ఉత్తర్వు.

ఇందుమూలకముగా అందరకు తెలియజేయడమేమనగా గవర్నమెంటువారి 15-6-49 తేది గల నెం. 1261 రు ఎల్. ఏ. ఉత్తర్వుల ననుసరించి విజయవాడ మునిసిపల్ కౌన్సిలువారు 22-11-49 తేది గల నెం 935 రు తీర్మానములో 1-4-1950 నుంచి యీ క్రింద కనుపరిచే రేట్లప్రకారము అన్ని బళ్లపైన పన్నులు విధించవలెనని తీర్మానించియున్నారు. ఇందుకు ఎవరైనను ఆక్షేపణలు తెలుపగోరినచో, వ్రాతమూలకముగా 31-1-1950 లోపుగా విజయవాడ మునిసిపలు కమీషనరుగారికి పంపుకొనవచ్చును. నియమించిన తేది తరువాత వచ్చిన ఆక్షేపణలు విచారించబడవు.

రేట్లు: ఇనుప టైర్లు గల బళ్లకు రు 4-0-0 అర్ధ సంవత్సరమునకు.
మ.రా:- సదరు బళ్లు రబ్బరు టైర్లలో బిగించబడినయెడల అర్ధ సం॥కు రు 1-0 0 తగ్గించబడును.

(సం) ఎస్. కృష్ణయ్య చెట్టి,
10-12-49 కమీషనరు.









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.